# కేసరి రత్నత్రయము

## లోధ్ర

గర్భాశయరోగనివారిణి

స్త్రీలకు గలుగు ఋతుశూలల, బహిష్టు కాకుండుట, అకాలబహిష్టు, మైల జాస్తిగాను తక్కువగాను పోవుట, కుసుమరోగము, సంతానహీనత, రక్తహీనత, మలబద్ధము, సూతికావాతము, కీళ్లనొప్పులు, అరికాళ్లు అరచేతులు మంట మొదలగు స్త్రీ మర్మ వ్యాధులను కుదుర్చును. లోధ్ర స్త్రీలపాలిటి వరప్రసాదము, కల్పవృక్షము, కామధేనువు, కొంగు బంగారము, రత్నఖచిత యాభరణము, సర్వాభీష్ట ప్రదాయినియని వాడినవారు పలువిధములుగ స్తోత్రము చేయుచున్నారు.

12 ఔ. రు. 4-4 0 | 6 ఔ. రు. 2-4-0

## అమృత

రక్తశుద్ధిద్రావకము

ఇది రక్తహీనత, మలబద్ధము, అజీర్ణము, కీళ్లనొప్పులు, సోమరితనము, మేహవ్రణములు, ముఖసంకటములు, నిస్సత్తువ, కడుపులోమంట మొదలగు వ్యాధులను నివారించి శరీరమునకు కాంతిని ముఖమునకు తేజస్సునుయిచ్చును. ఈ మేలైన యౌషధమువలన నెందరో యారోగ్యవంతులైనారు.

12 ఔ. రు. 4-4-0 | 6 ఔ. రు. 2-4-0

## అర్క

సర్వజ్వరనివారిణి

ఆహార, విహార ఋతుభేద దోషంబులవలన అన్నాశయమునందు క్రిమికూటముచేరి పలువిధములైన జ్వరములు సంభవించుచున్నవి. వాతజ్వరము, పిత్తజ్వరము, కఫజ్వరము, సన్నిపాతజ్వరము, మరి యితర విషమజ్వరములను, కడుపులో ప్లీహమను జ్వరగడ్డను కుదుర్చును. ఈ ఔషధమును పసిబిడ్డలకుగూడ యివ్వవచ్చును.

1 ఔన్సు బుడ్డి రూ. 1-2-0

తపాలా ఖర్చులు ప్రత్యేకము

### కేసరి కుటీరం లిమిటెడ్

ఆయుర్వేద ఔషధశాల

15, వెస్టుకాట్ రోడ్డు, రాయపేట, మద్రాసు 14.

తెనుగుజిల్లాలకు, నైజాముకు, ఏజంట్లు :

సీతారాం జనరల్ స్టోర్సు, బెజవాడ - సికిందరాబాదు.

# గృహలక్ష్మి

స్త్రీల ఆరోగ్య సౌభాగ్యములను
పెంపొందించుట కేర్పడిన
సచిత్ర మాసపత్రిక

సంపాదకుడు :

డాక్టరు కే. యన్. కేసరి

# GRIHALAKSHMI

సంపుటము ౨౨]　　ఫిబ్రవరి 1953　　[సంచిక ౨



# విషయసూచిక






వ్యాయామ క్రీడల్లో పాల్గొనేవారందరికీ అవసరమైన ఉత్సాహ శక్తుల్నియిచ్చే • ముఖ్యసాధనం అమృత - ఆ బాలగోపాలానికి అద్భుతమైన టానిక్ సేవించడానికి తియ్యగావుండి మాంచి చురుకుదనాన్ని కల్గిస్తుంది. ఈ అద్భుతమైన పానీయం ప్రసిద్ధమైన మూలికలచేతనూ ఫల రసాలతోను తయారుచేయబడింది. అందరికీ ఆత్మబంధువు లాటిది.




**కేసరి కుటీరము లిమిటెడ్ మద్రాసు**

---

తెలుగు జిల్లాలకు, నైజాముకు, తమిళనాడుకు ఏజంట్లు :

సీతారామ జనరల్ స్టోర్సు, బెజవాడ, సికింద్రాబాదు, మధుర.

---



శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాంతమ్మగారు

1953 సం॥పు 'గృహలక్ష్మి' స్వర్ణకంకణ గృహీత.




జయజయ గృహలక్ష్మీ సఖి ! - జయజయ లలితాంధ్ర ! మధుర సారస్వతమా !
జయజయ లలనా రత్నమ ! జయజయ విద్యాప్రబోధ ! జయకల్యాణీ !



# కళా సాంకర్యం



కళలు – ముఖ్యంగా లలితకళలు అభివృద్ధిగాంచుతున్న వనువిషయం నిర్వివాదాంశము. అందులో కళాసాంకర్యమున్నదను విషయం యదార్థము.

అయితే కళల కలయిక అవసరమా కాదా? ఈకళలు మొట్టమొదటినుండి కలసే యున్నవా? ఏకళ కాకళ స్వతంత్రంగా నిలబడి రాణించలేదా అనే విషయాలు పరిశీలించ తగినవి.

లలితకళలు అయిదు. అవి కవిత్వము, చిత్రకళ, సంగీతము, వాస్తుశిల్పము, శిల్పములని ప్రాచీనుల నిర్వచనము. వీనికి దేనిలో దానిని ప్రత్యేకంగా పరిశీలిస్తే మొదట పుట్టుక వొక్కొక్కటి స్వతంత్రంగానే పుట్టినవనడానికి చరిత్రాధారాలున్నవి. కాని అవి అభివృద్ధి దశలో సాంకర్యము తప్పనిసరి అయింది. అంటే ప్రజల అభిరుచిని బట్టి, మరింత ఆకర్షణవంతంగా రూపొందడానికి ఏర్పడింది. అసలీకళలు పుట్టుకకు కారణమును పరిశీలిస్తే మానవుడు తన భావాలను మాటలతో, రంగులతో, నాదముతో, శిలారూపముతో, తోటిమానవులకు అందివ్వడానికని తెలుస్తుంది. వాటి చిహ్నాలు వేరుగా నున్నవి.

ఉదాహరణగాచూస్తే వాల్మీకి రామాయణ శ్లోకాలను పాడలేదు ; చెప్పాడు. అలాగే చిత్రకళ, సంగీతము, వాస్తు శిల్పము ఆయా కళాకారులు తమ భావాలను

వెల్లడి చేయడానికే తమ ప్రవీణతను వినియోగించారు. కాని క్రమంగా కాలం మారుతూ వచ్చింది. కళల అభివృద్ధి దృష్ట్యా ప్రజల అభిరుచుల ననుసరించి కళల కలయిక పరిశోధనా పూర్వకంగా అమలులోనికి వచ్చింది.

కళాసాంకర్యమును పూర్తిగా తగదని త్రోసివెయ్యలేము. లేదా సాంకర్యము మూలంగా అన్ని సత్ఫలితాలని చెప్పలేము. చక్కగా అల్లిన పద్యాలను, శ్లోకాలను భావయుక్తంగా చదువుటకంటె ఏదో రాగంతో పాడటంవలన రాగమాధుర్యం మరుగున కవితానైపుణ్యం తన ప్రాధాన్యం కోల్పోవుచుండుటకద్దు; లేదా భావప్రకటన లోపించడంకద్దు. కాబట్టే కవి ఎప్పుడు తన రచనలను చదువుచుండుటను చూస్తుంటాముకాని సంగీతపాటకుడుగా పాడటం అరుదు. శ్రీ మాధవపెద్ది వెంకటరామయ్యగారి బోటివారు రంగస్థలముమీద చదివే పద్యాలు భావాలకు, కవితకు ప్రాధాన్య మిస్తుంటవి. ఇక యితరులు అంతులేని రాగాలతోటి పాడేపద్యాలు యీ రెంటికి దూరం కావడం తరచుగా చూస్తుంటాము. ఇక సంగీత విద్వాంసుల ప్రసక్తికి వస్తే వారు రాగానికి, తాళానికి, లయకు యిచ్చు ప్రాధాన్యము భావానికి, కవితా నైపుణ్యానికి యివ్వడం చాల అరుదు. అలా వానికి ప్రాధాన్యమిచ్చి తన్మయత్వంతో పాడే విద్వాంసుడు మహోత్తముడని తప్పక చెప్పాలి. అంతేకాదు రాగతాళలయల సందట్లో కవిత, భావప్రకటన తన కొంత ప్రాధాన్యాన్ని కోల్పోవుచున్నమాట వాస్తవం. ఈ విషయాలు ముఖ్యంగా కొందరు తమిళగాయకులు తెలుగుపాటలు పాడేటప్పుడు గుర్తించడం సులభం.

నృత్యము, శిల్పము, చిత్రకళ, వాస్తు శిల్పములుకూడ భావప్రకటనకు ఏర్పడినవయినా యీనాడు వాని కలయిక బహుముఖంగా వ్యాప్తినొందుచున్నది. నృత్యమును వెన్నంటి సాహిత్యం, సంగీతం ఉండనే యుంటున్నవి. వాని మూలంగా నృత్యకళ మరింతగా రాణిస్తున్నది. చిత్రకళ, శిల్పములు సయితం రామాయణ భారతాది సాహిత్యముమీద నాధారపడి యున్నవి.

వాస్తు శిల్పమును పరిశీలిస్తే మానవజాతి మొట్టమొదట గుహాలలో నివసించింది. అంటే గృహ నిర్మాణం గుహాలతో ప్రారంభమయి యీ నాటికి మహోన్నతమయిన భవన నిర్మాణాలకు దారితీసి అంటే నాగరకతాభి వృద్ధితో బాటు భవన నిర్మాణం సాగుతున్నది. సారస్వతానికి నాగరకతమీద ప్రభావమున్న గురించి వేరుగా చెప్ప నవసరంలేదు.

లలితకళలు మరింతగా రాణించడానికి, మనోజ్ఞంగా విలసిల్లడానికి కళాసాంకర్యము అవసరమేకావచ్చు; కాని దేనికది స్వాతంత్రంగా అభివృద్ధిగాంచగలవు. కాబట్టి కళాకారులు ఏకళకాకళ తన ప్రాధాన్యము నశించకుండా చూచుకోడంకూడ అవసరమేమో!

---

# సమయమాసన్నమయింది?

ఉపగుప్తుడు ఒక పరివ్రాజకుడు. దేశ ద్రిమ్మరి. అతడా అమావాశ్య చీకటిలో ఆనగరప్రాకారపు గోడకు చేరగిలి పండు కొనియున్నాడు. ఆదారిన పోతున్న వ్యక్తి కాలు ఆపరివ్రాజకునకు తగిలింది. ఉలికిపడి లేచి కళ్లువిప్పి చూచాడు. ఎదురుగా తరుణ నర్తకి వాసవదత్త ప్రత్యక్షమయింది.

ఆమె ముందుకు ఒరిగి చూచింది, ఉప గుప్తుని కండ్లలో నిర్మలమైన శాంతికాంతులు. అతని ముఖంలో క్షమాసంపన్న మయిన చిరునవ్వు వెలుగులు కనుపించినవి. అతనిచేతి నందుకుంటూ "స్వామీ! నా అపచారాన్ని మన్నించండి. మాగృహం పావనం చేసి నన్ను ఆశీర్వదించండి. మీకీ ధూళి దూసరములైన నగరవీథులు శయన యోగ్యములుకావు" అన్నది.

పరివ్రాజకుడు చిరునవ్వుతో "సుందరీ! సమయమింకా ఆసన్నంకాలేదు. నీదారిన నీవుపో. సమయము రాగానే నా అంతట నేనే మీయింటికి వస్తాను" అన్నాడు.

మెరుపులు, ఉరుములతో తల్లడించింది ఆకాశం. వాసవదత్త భయకంపితయై యింటికి పోయింది.

ఒక సంవత్సరముగడిచింది. నగరవాసులంతా వసంతోత్సవాలలో మునిగి తేలుతున్నారు. ఉపగుప్తుడు ఆవెన్నెట్లో ఒక వీధిన గబగబ నడిచి వెళుతున్నాడు. చివరకు అతడొక ఉన్నత సౌధంలోకి ప్రవేశించాడు. సమయ మాసన్నమైనది కాబోలు వాసవదత్త గృహాన్ని పావనముచేయడానికి!

నడుస్తూ యున్నాడు. అధాటుగా అతని కాళ్లదగ్గర ఒకయువతి శరీరం పడియున్నది. ఒకప్పుడామె జగదేక సుందరి; యిప్పుడు మాత్రం రోగగ్రస్తవ్రణభూయిష్ఠ.

ఉపగుప్తుడు కూలబడ్డ ఆమె శిరస్సును తన ఒడిలోకి తీసికొన్నాడు. ఆమె ఎండు పెదవులు విప్పి నోట్లో తన కమండలము నుండి నీళ్లు పోశాడు. నొప్పిపట్టిన కాళ్లు చేతులకేదో మూలికారసం పూశాడు. కోయిల గొంతెత్తి తన్మయత్వంలో కూయ మొదలిడింది. నర్తకి వాసవదత్త కళ్లుతెరచి మెల్లగా "ఎవరుమీరు యింత దయామయులు, ఉదారహృదయులు" అని ప్రశ్నించింది.

"నేనా-ఆనాటి పరివ్రాజకుడను - ఉపగుప్తుడను. మీగృహాన్ని పావనం చేసి నిన్ను ఆశీర్వదించడానికి వచ్చాను" అన్నాడు.

'యస్నిస్'




ప్రొఫెసర్ కె. అంజి

అతడు శతశిల్పి. శిల్పంలో అందరు మెచ్చి బంగారు తోడాలు వేసినారు. ఈ సంతోషంతో కొంతకాలానికి ఇంటికి వెళ్లినాడు. భార్య నవమాసాలు నిండిన గర్భవతిగా చూచినాడు. కోపం చెల రేగిపోయిందాతనికి. "ఎక్కడిదీ గర్భం," అన్నాడు. ఆమె "మీరు వెళ్లే రోజున నేను ఐదవ నాటిస్నానం చేసినాను — బైటచేరి. అందువల్ల మీరు ప్రయాణం ఒక్కరోజు ఆగి ఆ మరునాడు వెళ్లినసంగతి జ్ఞప్తికి తెచ్చుకొంటే మీరీ ప్రశ్ననన్నడుగరు." కాని అతనికి మనస్సులో కనికరం కలుగలేదు. దారిలో వస్తూవుంటే ఎవరో "శని పట్టుతూ వున్నట్టు ఇంక జాగ్రత్తగా 15 సంవత్సరాలు గడుపుకోమన్న" వృద్ధుని మాటలు జ్ఞప్తికి వచ్చినవి. ఇదే కాబోలు అనుకొనినాడు. భార్య గర్భం తనది కాదనుకొని వెళ్లిపోతూవుంటే ఎన్నో విధాల బ్రతిమిలాడుతుంది — ఆ సాధ్వి. ఆతను వినకుండా దూలం మీద తాటాకుల గ్రంథాలు పెట్టి పైబట్టకూడా లేకుండా వెళ్లిపోయినాడు — ఎచ్చటికో — ! ఎవరికి చెప్పలే ! !

♦ ♦ ♦

ఆమెకు చక్కని కొమారుడు కల్గినాడు. వానికి "విశ్వనాధుడని" పేరు పెట్టినారు. ఏడవ ఏడు వెళ్లింది. ఒకరోజూ ఆడుతూ వుంటే ఎవరో "పరాయీలకు పుట్టినవానితో చేరి మీరు చెడడం బాగాలేదు" అంటూ తమబిడ్డలను దండించడం విశ్వనాధుడు విన్నాడు. రివ్వున అమ్మవద్దకొచ్చినాడు. "మా నాన్నేడీ" అని అడిగినాడు. జరిగిన విషయం కొడుక్కు చెప్పింది — ఆమె. విశ్వనాధుడు తల్లిని ఓదార్చి "మా నాన్నను పిలుచుకువస్తా చూడు —" అన్నాడు. ఆమె దుఃఖం మరచిపోయి సంతోషంతో ఒడిలోకి లాక్కొని ముద్దుకొన్నది విశ్వనాధుణ్ణి. ఆశీర్వదించింది. ప్రయాణపు రోజురాగానే బిడ్డడు బైలుదేరినాడు — తనతండ్రిని వెదక్కొని తీసుకొనిరావడానికి. అమ్మ ఆనవాళ్లు తండ్రినిగురించి చెప్పింది. లోనికి వెళ్లి దూలంమీద ఉన్న పుసకాలన్నీ తీసుకొనివచ్చి కొడుక్కుయిస్తూ "నాయనా మీతండ్రి మహాశిల్పి అవే యీ గ్రంధాలన్నీ ! ఎందుకైన మంచిది ఇవి నీ వెంట తీసుకెళ్లి దారిలో కొంత వీటితో కాలక్షేపం నీవు చెయ్యొచ్చు, ఆయనకు ఆనవాలుగా యివి చూపవచ్చు" అంది.

♦ ♦ ♦

విశ్వనాధుడు బైలుదేరినాడు — దేశాటనానికి! మధ్యలో ఎందరినో కలుసుకొన్నాడు. ఎందరివద్దనో క్రొత్తవిద్యా సాంప్రదాయాలు నేర్చుకొన్నాడు. ఎన్నో పట్నాలు పల్లెలు, అడవులు, వనములు, పర్వతాలు, గాలించివేసినాడు. 14 ఏండ్లువాడు అయినా తండ్రి ఆచూకి తెలియలే — విశ్వనాధునికి. ఈ దిగులుతో ఆ రాత్రి నిద్రపట్టలే దతనికి! సత్రంలో ఎవడో చెప్పుకొన్న వార్తవింటాడు, అదియిది:-

"తంజావూరులో ఓ శిల్పి దేవాలయ శిఖరం కట్టుటకు కొన్ని నిబంధనాలు ఒప్పుకొన్నాడట. అతడు ఉత్తరాది వాడయినందున ఆ రాజు వానిని లోలోన అసహ్యించుకొని పైకిమాత్రం మంచిప్రేమను చూపుతూ దేవాలయ శిఖరపు నీడ ఉదయాస్తమయా

మలప్పుడుకూడా దేవాలయ శిఖరంమీదనుంచి క్రిందికి పారకూడదు. ఒకసంవత్సరంలో పూర్తి చెయ్యనిచో తల తరిగించబడుతుంది" అనే షరతు పెట్టినాడు.

"ఆరునెలలయిపోయినా బేసి మట్టం (నేలకు సమభూమి) వరకయినా గోడకట్టపడదు. ఇంకారు నెలల్లో ఆ శిల్పి ఆ దేవాలయం ఎలాకట్టగలడు? కావున ఆ శిల్పిని కోటగుమ్మానికి వ్రేలాడతీసేది నిజం. పనివాండ్లెందరినైనా తీసుకొంటారట. మనం పోదామా" అన్నాడు ఒకనితో మరొకడు. వారిమాటలువిన్న విశ్వనాథునికి కుడికన్ను అదిరింది. హృదయం తన తండ్రి అయివుంటాడని గట్టిగా కొట్టనారంభించింది. ముందు వారిద్దరు వెళుతూ వుంటే వారికి దూరంగా తానుకూడా బైలుదేరివెళ్లినాడు—తంజావూరికి.



విశ్వనాథుడు తల్లిచెప్పిన ఆనవాళ్ళనిచూచి తండ్రి అని తెల్సుకొన్నాడు - ఆ శిల్పిని. "ఈ ప్రమాదం నేను తప్పిస్తాను. నీవు జీవితాంతం వరకు నేను చెప్పినట్లు - చెయ్యగల్గితే!" అని ఆ శిల్పిని విశ్వనాథుడు సభ మధ్యంలో అందరి ముందర అడిగినాడు. ఆ శిల్పి ఒప్పుకొన్నాడు. వ్రాసి యిచ్చినాడుకూడా! విశ్వనాథుడు శిఖరమంతెత్తు గడ తెప్పించి మధ్యలో పాతించినాడు. మరునాడు సూర్యోదయంకాగానే ఆ స్తంభపునీడ ఎంతదూరం పడమటకు వ్యాపించునో ఆ చివరన మేకును కొట్టించినాడు. సాయంకాలంకాగానే సూర్యుడు అస్తమిస్తూవుంటే ఆ నీడ ఎంతదూరం పారిందో ఆ చివరన తూర్పు భాగంలో ఓ మేకు కొట్టించినాడు. వైశాల్యం తేలిపోయింది. గడాంతముందు రెండు పగ్గాలు కట్టించి తూర్పు పడమర్లు పాతించిన మేకులకు కట్టించినాడు. ఈ త్రాటి మధ్యలో దేవాలయ కట్టడం ఆరంభించబడింది. మూడు నెలల్లో పనిపూర్తి అయింది. పూత విగ్రహ - ప్రతిష్టలకు మరి మూడు నెలలు పట్టింది. ఒక్క ఆరునెలలలోగానే ఆ దేవాలయం చిన్న శిల్పియగు విశ్వనాథుని ప్లానుతో కట్టబడింది. రాజు వీరి అఖండ శక్తికి చాలా సంతోషించి, అనేక సన్మానాలు - ధనపురానులు వీరిద్దరికిచ్చినాడు. చిన్న శిల్పి తనకిచ్చినవన్ని పెద్దశిల్పివేయన, తన కవి వలదనీ, తనకు ఖరారునామా ప్రకారం పెద్దశిల్పి యావజ్జీవ పర్యంతం తానేమి చెప్పితే అది చెయ్యవలయునని అన్నాడు. అప్పుడు రాజు పెద్దశిల్పివైపు చూచినాడు. పెద్దశిల్పి తలయాడించినాడు. అప్పుడు "చిన్నశిల్పీ! నీవేమి చెయ్యమంటావు-పెద్ద శిల్పిని" అని రాజు అడిగినాడు. చిన్నశిల్పి ఇలా అన్నాడు "ఈతను మాతండ్రి. మా అమ్మతో తగవులాడి దేశాటనానికి బైలుదేరినాడు. నాకేడవ ఏటఎవ్వరో తండ్రిలేనివాడని తిట్టగా! మా అమ్మతో వెదుకొక్కనివస్తాను మానాయన్ను. దిగులుపడవద్దని చెప్పినాను. ఈ తాటాకు గ్రంథాలు మా అమ్మ నాకు యిచ్చి ఆనమాలకు మీ నాన్నకుచూపు అని చెప్పింది." అని తన సంచిలోవున్న తాటాకు పుస్తకాలు బైటవుంచినాడు. పెద్దశిల్పి అవి తనవేయని ఆనవాలు పట్టినాడు. సభికులెంతో సంతోషించినారు. యిద్దరిని వారి గ్రామానికి ఏనుగుల మీద పంపినాడు ఆ రాజు. తల్లికి సంతోషం కల్గించి - శని డబుల్ ఏడున్నరకాగానే 15 సంవత్సరాలకు.

# పార్వతీ!



శ్రీమతి స్థానాపతి రుక్మిణమ్మ

పెఱిగినచేవసంద్రమున బీటలువాఱనినావ యంఘ్రికిన్
మొఱుగగుపావ యెల్లపుడు మేలునుఁగోరెడు బావ పూలచే
మెఱుపగు తీవ కంటకము లుండనిత్రోవ వధూటిమేను సం
గిఱుకొనుగోవ మర్త్యులకు కేవల మోదదమౌర పార్వతీ!

పఱుగిడులేగ కుక్కలును పందులు పొర్లెడు గోత గోతిలో
బెఱిగినతేగ చేలతను బెట్టక పుట్టిపెకల్చుచుండినన్
దఱుగని జోగ స్వైరిణులఁ దద్దయు వేడుకగూడి మిండల
న్మఱగిన ఱాగ మోసమును మానక తెచ్చును సుమ్మ పార్వతీ!

లోచనమందు దోమ చెవిలోఁజొరబాఱినచీమ క్రొత్తగాఁ
జూచినసీమ వృద్ధునకు సూటిగ గట్టిన తమ మేనునన్
వేచిన పాము యెల్లపుడు వేదనగుండెకు భామ మానముం
దాచని రామ మర్త్యులకు తప్పక దుఃఖము నిచ్చు పార్వతీ!

జరుగనిమాట మానవులు సాగనిబాట బుధౌఘ మెన్నడున్
దిరుగనిపేట యెల్లపుడు తీర్చెడు వేట ఖరాంశు తాపముం
బఱపనితోట రజ్జులను పెక్కెడుజూట తపస్విముఖ్యులన్
దఱిమెడుమోట నిందలకు తప్పక బొల్పడు ధాత్రి పార్వతీ!

మలయపుగాలి నైజధవుమాటను దాటనియాలి శీతున
న్వెలిగెడుకీలి దానగుణ నిష్ఠధనాఢ్యుని జాలి కైతలం
గల మృదుశైలి భక్తజన కామదుఁడౌ వనమాలి నీతిచే
వెలుగు సుశీలి ధారుణిని వేమరు సన్నుతి కెక్కు పార్వతీ!

వీరునిచేతికత్తి యడవింగను పట్టిన త్రాచునత్తి జె
న్నారెడి యాముసం గనఁగ నక్కజమై జనుచుండు హత్తి యె
వ్వారిని గొంకకెల్లపుడుఁ బ్రాణ విహీనుల జేయుమిత్తి యే
పారినసత్తి మర్త్యుల కపారభయంబు నొసంగు పార్వతీ!



# ఆయుః ప్రమాణం పెంపుకు సోవియట్ శాస్త్రజ్ఞుల కృషి

మానవ జీవిత ప్రమాణం పెంపుదలకు ఉక్రేనియన్ శాస్త్రజ్ఞులు తీవ్రంగా పరిశోధనలు సాగిస్తున్నారు. అలెగ్జాండర్ బొగొమొలెట్స్ పేరుపెట్టబడిన ఎక్స్పెర్మెంటల్ బయాలజీ అండ్ పేథాలజీ సంస్థ వృద్ధాప్యానికి గల శారీరకమైన కారణాలగురించీ, తొందరగా ముసలితనం రాకుండా నిరోధించే పద్ధతుల గురించీ పరిశోధన సాగించడానికి ఒక సంఘాన్ని నెలకొల్పింది. ఈ సంఘాధ్యక్షుడు ప్రొఫెసర్ యూరీ స్టాసాకు కొట్‌స్కీ టాస్ విలేఖరితో ఇలా అన్నారు.

ఉక్రేనియన్ శాస్త్రవిజ్ఞాన పరిషత్తుకు చెందిన క్లినికల్ ఫిజీయోలజి సంస్థ ఉద్యోగులతో కలసి మా సంస్థ, అకాల వార్ధక్యాన్ని నిరోధించడం గురించి చాలకాలమై కృషిచేస్తూంది. దీర్ఘ జీవితానికి అనువగు పరిస్థితులను గురించి శాస్త్రజ్ఞులు పరిశోధన చేస్తున్నారు; వృద్ధాప్యానికి కారణాలను తెలుసుకుంటున్నారు; త్వరితంగా ముసలితనం రాకుండా నిరోధించే హేతుబద్ధమైన పద్ధతులను కనిపెడుతున్నారు.

ఈ సంస్థకు చెందిన సంఖ్యావివరసేకరణ కార్యాలయంవారు ఉక్రేనియన్ రిపబ్లిక్‌లో నివసించే 90 ఏళ్లకుపైపడిన వేలాది వృద్ధుల గురించి వివరాలను సేకరించారు.

త్వరితంగా వృద్ధాప్యం రావడానికి కేంద్ర నాడీ వ్యవస్థ సవ్యంగా పని చేయకపోవడం ఎంతవరకూ కారణమవుతుందో మా సంస్థ సభ్యులు పరిశోదిస్తున్నారు. ప్రఖ్యాత రష్యన్ శాస్త్రజ్ఞుడైన ఇవాన్ పావ్‌లోవ్ సిద్ధాంతాన్ని ఆధారంగా చేసుకుని యీ పరిశోధనలు జరుగుతున్నాయి. ఈ కృషి సాగించడంలో ఉక్రేనియన్ శాస్త్రజ్ఞులకు సోవియట్ శాస్త్ర విజ్ఞాన పరిషత్తుకు చెందిన హయ్యర్ నెర్వస్ ఏక్టివిటీ ఇన్‌స్టిట్యూట్ చాల సహాయం చేస్తూంది.

రక్తపోటు తగ్గించడానికీ, జ్ఞాపకశక్తి పునరుద్ధరించడానికీ, కండరాలశక్తినీ, వృద్ధులలో నిరోధక శక్తినీ పెంపొందించడానికీ తోడ్పడే మందులను ఉక్రేనియన్ శాస్త్రజ్ఞులు పరిశోధిస్తున్నారు.

70 నుండి 117 సంవత్సరాల వయసుగల వారికి చిన్నచిన్న మోతాదుల్లో నెత్తురు ఎక్కించడం మూలంగానూ, ప్రాణవాయువుతో నిండిన గాలిని వారు పీల్చడం మూలంగానూ కలిగే ఫలితాలు పరిశీలింపబడ్డాయి.

ప్రాణవాయువు ప్రయోగం (ఆక్సిజన్ థెరాఫీ) చాలమంచి ఫలితాల నిచ్చింది. ప్రాణవాయువుతో నిండిన గదిలో (ఆక్సిజన్ టెంట్) ఒక్కొక్కసారి 30 నుండి 60 నిము

పాల చొప్పున పదిసార్లు చికిత్స చేయడంతో ముసలితనంలో నిద్రపట్టకపోవడమనే జబ్బు కుదిరిపోయింది. జ్ఞాపకశక్తి ఎక్కువైంది; చాలమందిలో కేంద్రనాడీవ్యవస్థ చేసేపని, యీవ్యవస్థ ప్రధాన భాగమైన సెరిబ్రల్ కార్టెక్స్ చేసేపని బాగా పెంపొందింది.

కేప్‌నగర్ వాస్తవ్యుడు పి. త్కాచెంకో కేసును దృష్టాంతంగా తీసుకోవచ్చును. అతనికిప్పుడు 117 సంవత్సరాల వయసు. 1949లో ప్రత్యేకచికిత్స రోగనిరోధక చర్యలు జరపడంవల్ల అతని ఆరోగ్యంచాల బాగుపడింది. అతను నల్లసముద్ర తీరమంతా పర్యటన కూడా చేశాడు. అతనిప్పుడు ఆరోగ్యంగా, ఆనందంగా వున్నాడు.

ఈ విషయంలో యీ సంస్థ సంపాదించిన అనుభవంవల్ల అకాలవార్ధక్యాన్ని నిరోధించే ప్రత్యేకవైద్య సంస్థలను నెలకొల్పే సమస్య ఉత్పన్నమవడానికి అవకాశముంది.

శాస్త్ర విజ్ఞానందృష్ట్యా సగటు మానవ జీవిత ప్రమాణం 150 సంవత్సరాలు చెయ్యవచ్చును.

సోవియట్ దేశంలో అధికస్థాయిలో సాధింపబడిన ప్రజలపని, జీవితపరిస్థితుల అభివృద్ధీ, వారి ఆరోగ్యరక్షణ, యివి మానవ జీవిత ప్రమాణాన్ని బాగా పెంపొందించడానికి అనేకమంది శాస్త్రవేత్తలు కన్న కలలన్నీ సుదూర భవిష్యత్తులో నిజమవుతాయనడానికి హామీనిస్తున్నాయి.

'టాస్' నుండి

—o—

లలిత తన స్నేహితురాలైన రమాదేవితో "మన పంతులమ్మ మనము యిక్కడ యితరులకు సహాయము చేయడానికున్నామంటున్నది" అన్నది.

"అవును; నిజమే."

"మరి యితరులు మరి యిక్కడెందుకున్నారో!"

◆ ◆ ◆

ఒకావిడ పిచ్చాసుపత్రికి చూడడానికి వెళ్ళి వరండాలో వింతగా కళ్ళెర్రజేసి చూస్తూపోయిన ఒక స్త్రీని చూచి భయంతో సూపరింటెండెంటు దగ్గరకువెళ్ళి "ఇప్పుడు యిటు వెళ్లినామె అలా భయంకరంగా చూస్తూ వెళ్లింది - ప్రమాదకరమైన వ్యక్తి కాదు కదా" అని అడిగింది.

"కొన్ని సమయాలలో ప్రమాదకరమైన వ్యక్తియే."

"అయితే ఆమెను అలా స్వేచ్ఛగా తిరుగనిస్తున్నారేమిటి."

"అంతకంటే చేయకలిగింది ఏమి కనుపించలేదు."

"అయితే యీహాస్పిటలులో ఆమె మీఅదుపాజ్ఞలలో లేదా ఏమిటి."

"లేదు. ఆమె నాభార్య"

'సిసి'

# ముట్టుకొట్టుకి తాళంకప్ప

ఎస్. కామేశ్వరరావు.

వెంకన్నపంతులు వుత్తి చవటదద్దమ్మ అంటే నమ్మండి. పెళ్ళాం యెలాగ చెప్తే అలాగ అక్షరాల నడుచుకునేవాడు చవట కాకపోతే మరేమిటి? ఆమె చెప్పినట్టు చెయ్యకపోతే ఆమహా యిల్లాలికి కోపంవస్తుందేమోనని కాబోలు అతని భయం. మొగుడి అనువు కనిపెట్టి తన చేతిలో కీలుబొమ్మలాగ త్రిప్పుకుంటూంది భార్యా శోధమ్మ.

వెంకన్న పంతులు యింతో అంతో చదువుకున్నవాడు; వుద్యోగంచేస్తూ వున్నవాడు అయివుండి, యెంత పెళ్ళాం బెల్లం ముక్క అయినాను అంత నెత్తినెక్కించుకోవడమేమిటి? అదేమిటో ఆ అమాయకుడు మొదటినుంచి భార్యాకి లోకువ అయిపోయినాడు. మొక్కఅయి వున్నప్పుడు వంచకపోతే మ్రాను అయినప్పుడు ఒంగుతుందా! ఆవిడ చెప్పినట్టు చెయ్యకపోతే తన అవసరాలకి దగ్గరకు రాదేమో! వెధవధి! పెళ్ళాన్ని అదుపులో పెట్టుకోలేని మొగుడొక మొగుడా! కర్ర మొద్దేకాని.

యీ మధ్యను విశాఖపట్నంలో దొంగలడావుడి జోరుగావుందని శోధమ్మకి బుచ్చమ్మ అత్తిక చెప్పిందట. ఆ మాటపట్టుకొని మొగుడి దగరకి గబగబా పరుగెత్తుకు వచ్చి, "యేమండీ! వూళ్లో దొంగతనాలు హెచ్చు పెరుగుతున్నాయట కదా! ఆ సంగతి నాతో చెప్పనైనా చెప్పేరుకాదే! అంత మందమతయితే యెలాగండీ!" అంది, చేతులు తిప్పుకుంటూను.

"ఆ!.... మనయింట్లో ఏముందే యెత్తుకుపోవడానికి! అనవసరంగా నీ మనస్సుకి యెందుకు నొప్పి కలిగించడమూ అని వూరుకున్నాను" అన్నాడు బీరువా డ్రాయిరు లోపుకితోస్తూ వెంకన్న.

"బాగుందండీ! మీమాటలూ మీరూను! మొన్న పండుక్కి కొన్న జరీచీరే ముట్టుకట్టలో వుండిపోయింది. ఆ మూట వీధి కొట్టులో పెట్టానుకదా! యెవరైనా తీసుకుపోతేనో!"

"అయితే నన్నేమి చెయ్యమంటావు?"

"యేంచెయ్యమంటాను! నెత్తిని చేతుల్ను పెట్టుకొని కూర్చోండి, బాగా బోధపడుతుంది! మొగాడయివుండీ కొంచమైనా యింటి జాగ్రత్త తెలియకపోతే యెలాగండీ! అన్నీ నేనెంతకని చెప్పగలను, ఆడదాన్ని!

యిదుగో! మన యినపతాళం తీసుకొని వెళ్ళి ఆ కొట్టుకి వేసిరండి, యెందుకేనా మంచిది."

"బాగుందే నీ వాలకం. ముట్టుగుడ్డలు యెవడికి కావాలే! అన్నింటికి చాధస్తం ఓడకుసుమా నాకు అసహ్యాం!"

"మీకు అసహ్యాం అయితే నాకేమీ అసహ్యాంలేదు. దొంగాడికి అదీయిదీ అన్న భేధమేమిటి? చేతికి యేది దొరికితే అదే పట్టుకుపోతాడు. వూళ్ళో దొంగతనాలు చాలా తమాషాగా జరుగుతున్నాయట. యివ్వాళ బుచ్చమ్మ అత్తిక చెప్తూవుంటే నాగుండెల్లో దడపట్టుకుంది. నాలుగు రోజుల కిందట గాడు వీధిలో దొంగలుపడి ఒక యింట్లో మొగుడూ పెళ్లాం పడుకుంటే ఆ మొగాడిని కాళ్లు చేతులు కట్టేసి, పెళ్ళాన్ని సుభ్రంగా దోచుకున్నారు. మీకేమి పోయింది? మొన్న పండుక్కి మా అమ్మ కొనియిచ్చిన పట్టుచీరె ఆ బట్టల్లోవుండి పోయింది. యెవరన్నా పట్టుకుపోతే మళ్ళీ మీరు కొనగలరా యేమన్నానా. నా అదృష్టంకొద్దీ ఆ చీరె ఆ కట్టలో వుండి పోయింది. వెళ్ళి తాళంనొక్కిరండి" అంది చీదరించుకుంటూ శోధమ్మ.

పాపం! పెళ్ళాం చెప్పినట్టూ తాళం వెయ్యక తప్పిందికాదు వెంకన్న పంతులుకి.

ఆ రోజు మధ్యాహ్నం భోజనంచేసి మామూలుగా ఆఫీసుకి పోయేడు వెంకన్న పంతులు.

అతను అలాగ సందు మలుపు తిరగ్గానే ఒక వ్యక్తి వాళ్ళగుమ్మంలోనికి వచ్చి తలుపు గుద్దుతున్నాడు. "శోధమ్మగారూ! శోధమ్మగారు! తలుపుతియ్యండి"అంటూను.

యెవరో తలుపుగుద్దుతున్నారని ఆవిడ తలుపు తీసి, "యెవరోయినువ్వూ!" అని అడిగింది.

"నేనమ్మా! తోటపాలెం చాకలివాడిని. బాబుగారు త్రోవలో కనిపించి, 'ఓరే! అప్పిగా! ముట్టుబట్టల మూట ఒకటి వుండి పోయిందిరా మాయింట్లో, కాస్త వుతికి పెడుదూ పావలాడబ్బులిస్తాను. మా చాకలి వాడు బల్లలపండుగ అయితేకాని రాడుట, అంటే బాబుగారిమాట కాదనలేకవచ్చేను. ఆ బట్టలు యెక్కడవున్నాయో చూపిస్తే తీసుకుపోతాను' అన్నాడు.

పాపం! ఆ యిల్లాలు నిజమేకాబోలు అనుకుంది.

"అయితే యిలారారా!" అంటూ కొట్టు తాళంతీసి, అదిగో ఆ గోడకి తగిలించిన మూట జాగ్రత్తగా తీసుకో, అని చెపుతూ వాడికి ఆ బట్టలు చూపెట్టింది.

"చిత్తం! అమ్మా! రేపు వుదయాన్నే వుతికేసి తీసుకొని వస్తాను" అంటూ ఆ మూట కాస్తా చంకను పెట్టుకొని వుడాయించేడు.

రాత్రి మొగుడు యింటికివచ్చిన తరువాత జరిగిన సంగతంతా చెప్పింది శోధమ్మ.

"నేనెవరినీ పంపించలేదే" అన్నాడు! అతను ఆశ్చర్యంగా ముద్దనోట్లో పెట్టుకుంటూను.

"అదేమిటండీ అలాగ అంటారు! యెవరో తోటపాలెం చాకలివాడట. మీరుపంపే రని చెప్పి మూటపట్టుకువెళ్ళేడు."

"మంచిపనిచేశావు. అన్ని నీతులూనువ్వే నాకు చెప్పి ఆ గోతిలో నువ్వేపడ్డావూ? వాడు యెవడో దొంగముండాకొడుకు మల్లేవున్నాడు. నిన్ను దగాచేసి ఆ కట్టపట్టు కొని పోయాడు."

"అయ్యో! అయ్యో! నాకర్మంకాలా! అయితే యింకా అలాగచూస్తారేం! ఆ రెండుముద్దలూ నోట్లోపెట్టుకొని పరుగెత్తి వెళ్ళి పోలీసుస్టేషనుకి చెప్పండి. యాభైరూపాయిల చీరె వాడియథాన కొట్టేను. వేగిరం వెళ్ళి పోలీసులకి చెప్పితే వాడు యెక్కడ వున్నాడో వెతికి పట్టుకుంటారు." అంది కళ్ళు తుడుచుకుంటూ శోభమ్మ.

"నీ మొగం! వూరూ లేదు పేరూ లేదు. పోలీసులకి యేమని రిపోర్టు యివ్వడం వాళ్ళకికూడా కాఫీకర్చులు దండుగ. పోయిందేదో పోయింది యింకనోరు మూసుకొని వూరుకో. యెంత పెళ్ళామైనాను! తాడుకట్టిన మొగుడు అవునా! వాడిమాట శాస్త్రఅయినా వినకపోతే! మరేమి అవుతుంది? ఆచీరె నువ్వుకట్టుకున్నప్పుడే చెప్పాను, ఒకరోజు సరదాకి కట్టుకొని పెట్లో పెట్టేసుకొమ్మని. అలాగ చేసావా? వూరందరికీ మీవాళ్ళు యిచ్చినచీరె చూపెట్టాలని యెహార్భానికొద్దీ నాలుగు రోజులు కట్టుకొని తిరిగేవు. నీఅదృష్టంకొద్దీ దానితోటే బైటపడ్డావు. యేంచేస్తాము! మనకి ప్రాప్తం లేనివస్తువులు అలాగేపోతాయి" అన్నాడు, చెయ్యి కడుగుకుంటూను.

# నటీనటుల, శరీర సౌష్ఠవ రక్షణ

శ్రీ డి. వి. ఏ. ఆచార్య బి. ఏ.

నాటక రంగానికి శరీర సౌష్ఠవంతో బాటు, నటనా నైపుణ్యం ప్రజాసంగీత పరిచయం చాలా అవసరం. శరీర సౌష్ఠవంకంటే కూడా మిగిలిన హంగులే నాటకరంగంలో ఎక్కువ ప్రాధాన్యత వహిస్తాయి. చలన చిత్ర రంగంలో నటనా నైపుణ్యం ప్రజాసంగీత పరిచయం లేకపోయినా ఫరవాలేదు. నిర్మాత వాటికి తగ్గ ఏర్పాట్లు చేస్తాడు, తర్ఫీదు ఎక్కువ యిచ్చుకుంటాడు. కాని శరీర సౌష్టవం మాత్రం అత్యవసరం. చలన చిత్ర శాస్త్రం సాంకేతికంగా వృద్ధి పొందిన కొద్ది నటీనటుల ఎన్నికలో ప్రధాన సూత్రంగా నిర్మాతలు తీసుకొంటున్నది వాళ్ల శరీర సౌష్ఠవ మొక్కటే. మిగతా నిపుణతలు వుంటే మరీ మంచిది. లేకపోయినా తంటా లేదు. అందువల్లే పొట్ట పొడిచినా అక్షర జ్ఞానం, కళా జ్ఞానం లేని తారలు, గ్రహాలు, "స్టూడియోలను వదలకుండా వుండడం, వాళ్లను నిర్మాతలు వదలక పోవడానికి కారణం_వాళ్ల పాటవం కావచ్చు. నటనా నైపుణ్యం వుండి అంగసౌష్ఠవం (Personality) లేనివాళ్లు తెర మీదకు రాని సహాయదర్శకత్వమో, మరొక దర్శకత్వమో, వహించి తమ వుత్సాహాన్ని తృప్తిపరుచుకుంటూ వుంటారు. ప్రజాసంగీతంలో నిపుణతగల వాళ్లు, అంగసౌష్ఠవంలేక తెర వెనుక, నేపథ్యసంగీతం పాడుకుంటూ జీవితాలు వెళ్లబుచ్చుకుంటున్నారు. పాత్రాలంకరణకు పనికిరాక, సంగీతము (పాట)నకు ప్రాముఖ్యతగలవార్కి కూడా తెర వెనక యుండి తమ పాటను ప్రజలకు వినిపింపగల భాగ్యముతో జీవితము గడుపుకొనుచున్నారు. ఇవన్నీ చూస్తే, ఏదో విధంగా తెరమీదకు వచ్చే అవకాశంకల ఓ తార గానీ ఓ నటుడుగానీ, తమకా అవకాశం యిచ్చిన తమ శరీర సౌష్టవాన్ని ఏ విధంగా పోషించుకోవాలో నేర్చుకోవాలి అని తేలుతోంది. తెరమీదకు వచ్చిన క్రొత్తల్లో తటిల్లతల్లాగు మెరిసి ప్రేక్షక హృదయాల్లో హత్తుకపోయే నటీనటులు అల్పకాలంలో తమకాని ఆకర్షణకోల్పోయి, యింకువ కట్టిన గుడ్డల్లా - మారడానికి కారణం-వాళ్లు శరీర సౌష్ఠవరక్షణలో చూపే అశ్రద్ధే. తమకు కళారాధనావకాశాన్ని, బ్రతుకు తెరువుని, ప్రేక్షక హృదయాలను జయించడానికి తగ్గ అవకాశాన్ని, ఆశాజనక భావిని కల్పించిన తమ శరీర సౌష్ఠవం యొక్క విలువ నటీనటులు విస్మరించకూడదు. నిజానికి కొంతమంది తారలు దేవతారూపాల్లో తెరలమీద సాక్షాత్కరిస్తారు క్రొత్తల్లో. అయితే ఆ తళుకు అత్యల్పకాలంలో నశించేలా ప్రవర్తిస్తారు. శరీరాన్ని గూర్చి మరింత శ్రద్ధతీసికోరాదా ! అని ఎవరైనా అడిగితే వాళ్ల సమాధానం యిలావుంటుంది, "మేము సంపాదించే డబ్బులో నాల్గింట మూడువంతులు మా తిండికీ శరీరపోషణకే ఖర్చిస్తున్నాము. మమ్ము విమర్శించే వాళ్లు తినే తిండికంటే మేము తినే తిండి, నూరు రెట్లు ఖరీదుంటుంది. మా పౌడర్లకు, స్నోలకు, లిప్‌స్టిక్‌లకు, క్రీంలకు, చీరలకు యితర అలంకరణ సాధన సామగ్రికీ అయ్యే ఖర్చు లెక్కే లేదు. ఇంకా మా శరీర సౌష్ఠవం నిల్పుకోడానికి మేమేం చేయాలి?" అంటారు. నిజమే వాళ్లు చెప్పేది అక్షరాలా సత్యమే. వాళ్ల సౌందర్య రేఖలు అల్పకాలంలో అంతరానమవడానికి కారణం వారు చెప్పే సమాధానంలోనే వుంది. వాళ్లు సంపాదించింది సంపాదించినట్లే క్రొత్తలో ఖర్చించేమాట వాస్తవమే. విపరీతమైన తిండి, శరీరానికి సహజమైన కదలిక యివ్వని విలాసాలు, నిద్ర, సుఖము, వీటిలో వాళ్లు స్వప్నలోకాల్లో విహరిస్తారు. తమ భూమిక నిర్వహణలో ఏదైనా పరిశ్రమకు అవకాశం తగిలితే తప్ప సహజ జీవితంలో వాళ్లకు శరీర పరిశ్రమలేని పరిస్థితి కల్పించుకోడంతో శరీరం దాని సహజ సౌష్ఠవాన్ని కోల్పోతుంది. కృత్రిమమైన వాళ్ల జీవితాల్లోకి సూర్యకిరణంకూడా (నిర్మాత తలచుకుంటేతప్ప) చొరపడదు. అల్పకాలంలోనే యీ అసహజ జీవితం శరీరాన్ని

వికృతం చేస్తుంది, కదలి కంటే, బద్ధకం ఆయాసం ఏర్పడుతుంది. తటిల్లతత్వం మాయమై సోంబేతనం ఎక్కువవుతుంది. తారల విషయంలో యీ విధానం అక్షరాలా సత్యం, కార్లు సోఫాలు, స్వీట్లు, చీకు, చింతాలేని జీవితం, ప్రియులు, ప్రియభాషణాలు, కావలసినంత డబ్బు, అగణ్యమైన కృత్రిమాలంకరణ సాధనాలు, వీటితో వాళ్ళ జీవితం చైతన్యం కోల్పోతుంది. ఓ జడమై పోతుంది. అందువల్లే మోయలేని శరీరాలతో వెండితెరనుండి త్వరలోనిష్క్రమించడమో లేకపోతే ప్రేక్షకులకు తీరని ఆశాభంగం కల్పించి, విమర్శకు గురికావడమో జరుగుతుంది. ఈ విషయం గ్రహించిన పాశ్చాత్యతారలు, నటులు కూడా అన్నిటికంటే తమ శరీరసౌష్ఠవం, ముఖ్యంగా పరిగణిస్తారు. దానికోసం ధనాన్నికూడా లెక్క చేయరు. వాళ్లు తప్పనిసరిగా నిత్యంకొంత కనీస పరిశ్రమ చేస్తారు. ఈ మధ్య ఓ పత్రికలో ప్రచురించినట్లు పాశ్చాత్యతారలు ముఖ్యంగా హాలివుడ్ తారలు యీ పరిశ్రమను దృష్టిలో పెట్టుకొని తమకు కార్లువున్నా, వాటిని యిళ్లదగర వదలి స్టూడియోలకు, యితర చోట్లకు సైకిళ్ల మీద తిరుగుతారట. ఇది చాలవరకు పరిశ్రమ దృష్ట్యా సహాయపడుతుంది. మన నటీనటులుకూడా వేరే పరిశ్రమ చేసినా, చేయక పోయినా యీ విధానం అవలంబిస్తే కొంతవరకు మంచిది, భారత జాతీయతకు తగట్లు మనతారలు తమ జీవితాలను దిద్దుకుంటే వాళ్లకే సహజ సౌష్ఠవం పాడైపోదు. భారతీయనాట్యం అభ్యసిస్తే తారలు వేరే పరిశ్రమ చేయనక్కరలేదు. అటుకళ వృద్ధి పొందడమే కాకుండా అదో పరిశ్రమగా వాళ్ల శరీర సౌష్ఠవాన్ని శాశ్వతం చేస్తుంది. నటులకు యోగాసనాలు చాలా వుపకరిస్తాయి. లేకపోతే అనేక ఆటలున్నాయి. వాటిలో పాల్గొని తమ శరీర సౌష్ఠవం రక్షించుకోవచ్చు. ఇంతేగాక మన నటీనటుల అంగ సౌష్ఠవం త్వరలో అంతర్ధానం కావడానికి యింకా కారణాలున్నాయి. వాళ్ల కృత్రిమ జీవితవిధానాలు, దురూహలు, వాళ్లకు రాత్రి-పగలుగానూ, పగలు-రాత్రిగానూ వుంటుంది. షూటింగులు లేక పోయినా, క్లబ్బులు విలాసాలూ, వ్యాసంగాలతో రాత్రిళ్లు అలావూరికే గడిచిపోతాయి. పగలంతా (షూటింగ్‌వుంటే తప్ప) నిద్రతో గడిచిపోతుంది. వాళ్లకు వేళకు మితంగా ఆహారం తింటే ఆరోగ్యం బాగావుంటుందని తెలిసినా వాళ్లు గడిపే అతినాగరిక జీవితం మిత్రుల మర్యాదకోసం, నిర్మాతలు, దర్శకులు, టెక్నీషియన్లు తదితరుల మంచితనం కోసం క్షణక్షణం స్వీట్లు తినాలి. కాఫీలుతాగాలి, తాగే వాళ్లకు సిగరెట్లు, యితర పానీయాలు తప్పనిసరి అవుతాయి. జీవితం క్రమబద్ధం చేయడం కష్టసాధ్యమౌతుంది. ఇక వాళ్ల శరీరారోగ్యంకంటే పై మెరుగులకు ఎక్కువ విలువ యివ్వడానికి అలవాటు పడతారు. సబ్బులు రుద్దడం, పౌడరు అద్దడం, లిప్‌స్టిక్‌లు, రెండుజడలు, క్రాపులు దువ్వడం, స్నోలు రాయడం, అత్తరులు, సిల్కులు, ట్వీడులు, లాల్చీలు, జంపర్లు వీటితో తమ అనారోగ్యాన్ని, అంద వికారాన్ని కప్పిపుచ్చుకొని తిరగడం అలవర్చుకుంటారు. ఈ కృత్రిమసాధనాలన్నీ చివరకు అనారోగ్యానికి అందవికారానికే దారితీస్తాయి.

తారల్లోనూ, నటుల్లోనూ, విచ్చలవిడి స్వేచ్ఛ ఎక్కువ. ఇది యితర దేశాల్లోవున్న అలవాటే యిక్కడకు కూడా దిగుమతి అయింది. వాళ్లల్లో కొందరు బ్రహ్మచర్యమంటూ కృత్రిమజీవితాలకు, స్వేచ్ఛావిహారాలకు అలవాటుపడి అమాయకులను, అవినీతిపరులను మరింత అతఃపాతాళానికి నెడుతారు. ఈరకం స్వేచ్ఛకూడా శరీర సౌష్ఠవం నశించి శరీరం రోగభూయిష్ఠం అవడానికి కారణమవుతుంది. తారలూ, నటులూ నియమబద్ధమైన జీవితం అలవర్చుకోవాలి. వీళ్లు తమజీవితాలను సంయమించాలి. మితాశనం, సహజత్వం, పరిశ్రమ, లైంగిక నియమాలు, సంసారజీవితం, యివన్నీ అలవర్చుకుంటే తమ శరీరసౌష్ఠవం శతాబ్దాలపాటు చెక్కుచెదరదు. తారలు తటిల్లతలుగానే చాలా కాలం చెలామణిగా వచ్చు. ఇంకో విషయం ఏమంటే తారల్లో చాలమంది, నటుల్లో కొంతమంది వివాహం చేసుకోకుండా సహజమైన తమవాంఛలకు కృత్రిమమైన ఆనకట్టలు

కట్టి జీవితాన్ని తప్పుడు దారులకు పట్టిస్తారు. వీరికి మాతృత్వం, పితృత్వం పడిగట్టడమంటే నామోషిగానో, తప్పుగానో తోస్తుందనుకుంటాను. ఇది కేవలం దురూహ. ఓ తార తన సుకుమార బాహువుల్లో ఓ బిడ్డను ఎత్తుకొని, తన కళాహృదయంలో హత్తుకొని, తన ముగ్ధమోహన బింబోష్ఠాలతో ముద్దిడుకొని, తన మధుర గాన ప్రవంతితో జోలపాడి ఆనందించే భాగ్యం నోచుకోవాలని తహతహ లాడేబదులు, కృత్రిమజీవితానికలవాటుపడి సహజసంతాన వాంఛను చంపుకోడం ఎంతశోచనీయం? తారలు తాము తెరమీద ఎక్కినంత మాత్రంచేత అమానుషులో, అతిమానుషులో అయిపోయామని అనుకోడం అవివేకం. మొదట స్త్రీ, తరువాత తార. మొదట పురుషుడు; తరువాత నటుడు. క్రమబద్ధమైన జీవితం, సంసారముంటే సాధ్యమైనట్లు, సర్వావ్యామోహాలకులోనై ప్రతి ఆకర్షణకు భ్రమిస్తూ, స్వేచ్ఛా ప్రవర్తనకు అవకాశం వున్న వాళ్లకు సాధ్యంకాదు. క్రమబద్ధమైన జీవితం లేనిదే ఆరోగ్యంవుండదు. ఆరోగ్యం లేనిదే అంగసౌష్ఠవం నిలువదు. తెరమీద వేషంవేసినంత మాత్రాన స్త్రీ తన సహజధర్మాన్ని తప్పుగా భావించకూడదు. తనకళ, తన సంపాదన, తన సర్వస్వం తన పశుప్రవర్తనకే ఖర్చించే బదులు తనూ ఓ సంసారి అయితే సంఘం విలువయిస్తుంది.

తారల్లో సంతానాన్ని గూర్చి దురభిప్రాయాలున్నాయి. సహజ సంతానంవల్ల వ్యక్తి ఆరోగ్యం ఎప్పుడూ చెడదు. పైగా వృద్ధి అవుతుంది. సంతానాన్ని కన్న స్త్రీ ఎక్కువ కాలం బ్రతుకుతుందని తాను ఋజువు చేస్తానని డాక్టరు కాస్పర్ సవాలు చేశాడు. ఎరాస్మస్ 22 మందికన్న 95 సంవత్సరాల పండును గూర్చి వర్ణిస్తూ ఆమె ఎన్నడూ ఒక్క కన్నీటి చుక్కకూడా కార్చినట్లు కనబడదనియు, ఆమె శరీరం తేజోవంతంగానూ, స్నిగ్ధలావణ్యంగానూ వుండి ఎంతో చురుకుగా వుందని వ్రాశాడు. అయితే ప్రతితార పిల్లలకోడిలా తయారు కావాలని కాదు నావుద్దేశ్యం. తన సంతానాన్ని నిర్ణీతసంఖ్యలో సృష్టించుకోవచ్చు. కాని, సంతానం తమసహజ సౌందర్యానికి భంగకరమనే దురభిప్రాయం తొలగించడానికి పైవిషయాలుదహరించాను. పిల్లలకు పాలీయడంవల్ల తమ శక్తంతా సంతానానికే వ్యయమై తమ ఆరోగ్యం చెడిపోతుందనే తప్పుదభిప్రాయం మరొకటుంది. శాస్త్రజ్ఞులు, డాక్టర్లు, పిల్లలకు పాలీయకపోతే పిల్లల ఆరోగ్యం కంటే తల్లుల ఆరోగ్యం ఎక్కువ పాడవుతుందనీ రాస్తున్నారు. పిల్లలకు పాలీయడంవల్ల మర్మావయవ అంతర్భాగాలు త్వరగా వాటిపూర్వ సాధారణ స్వరూపాన్ని పొందడమే కాకుండా కండరబలం వచ్చి, ఓజోశక్తి వేగంగా స్త్రీకి చేకూరుతుందని రాస్తున్నారు. దీనిని బట్టి సంతానంవల్ల స్త్రీ ఆరోగ్యం చెడదనే కాకుండా సంతానం లేని స్త్రీ ఆరోగ్యం చెడడానికి అవకాశాలున్నాయని తేలింది. అందువల్ల శరీర సౌష్ఠవం ప్రాణంకంటె అధికంగా కాపాడుకొనే తారలు తమలో సహజత్వం పెంపొందడం కోసం, తమ స్త్రీత్వాన్ని, ప్రకృతి తమకిచ్చిన బాధ్యతలను, ఆనందాన్ని విస్మరించకూడదు. సంతాన నిరోధపద్ధతులు, చట్టవ్యతిరేక గర్భస్రావాలు, నాగరిక సమాజంలోనూ, తారాగణంలోనూ, అధికంగా అమలులో వున్నాయనడంలో సందేహంలేదు. కాని కృత్రిమగర్భ నిరోధపద్ధతుల వల్ల శరీరారోగ్యం చెడిపోవడాన్ని గూర్చి భిన్నాభిప్రాయాలున్నాయి. ఈ అభిప్రాయాల సంగతి ఎలా వున్నా చేతనైతే క్రమబద్ధమైన లైంగిక జీవితం వల్ల సంతాన నిరోధం ఉత్తమ పద్ధతి. పెసరీలు, అప్లాజివ్‌లు, కెమికల్సు, వాడడం ఎప్పుడూ ప్రమాదకరమే. అతిసున్నితమైన యోనిలోని అంతర్భాగాల మీద పలుచనిపొర యీపెసరీలవల్ల పాకావస్థ (Irritation) పొందుతుంది. క్వినైను, రసాయనిక పదార్థాల్లోని పరమాణువులు యోనిలోని పలుచని పొరద్వారా గ్రహింపబడి శరీరానికి అనారోగ్య కారణాలౌతాయనేది నిర్వివాదాంశం. పైగా యీపద్ధతులు సంతానాన్ని పూర్తిగా ఖరారుగా నిరోధిస్తాయనడానికి వీలులేదని బ్లాకర్ .లాంటి శాస్త్రజ్ఞులు చెప్తూనే వున్నారు. కాబట్టి సహజశరీర

సౌష్ఠవ రక్షణకోసం తాపత్రయపడేవారలు యీవిషయాలు గ్రహించాలి. ఇక గర్భస్రావాల విషయం తీసుకుందాం.

ఇండియన్ పీనల్ కోడ్‌లో 312, 313, 314, 315, 316 సెక్షన్ల ప్రకారం ఒక గర్భిణికడుపు పోగొట్టడం శిక్షార్హమైన నేరంగా వర్ణింపబడింది. వైద్య పద్ధతిగా గర్భిణిని బ్రతికించడానికి చేయబడితే తప్ప ఈగర్భస్రావం పెద్దనేరంగా పరిగణింప బడుతుంది. స్త్రీ అంగీకరించి చేయించుకున్నా, శిక్ష మాత్రం గర్భస్రావం చేసిన వ్యక్తికీ, చేయించుకున్న స్త్రీకి విధించబడుతుంది. గర్భం పోగొట్టే విధానాల్లో రసాయనిక పద్ధతులు (మందులవల్ల,) భౌతిక పద్ధతులు (Mechanical) వున్నాయి. వీటిలో కొన్ని చాలా మోటుపద్ధతులు. ఈపద్ధతులవల్ల యోని అనేక వికారాలకు గురి అవడం ఆకస్మికంగా షాక్, రక్తస్రావం, సెప్టిసీమియా, టెటనస్, మొదలగు ఘోరవ్యాధులకు బలి అయి మరణించడం జరుగుతూనే వున్నాయి. ఇలాంటి ప్రమాదాలు తప్పించుకున్నా, నరములకు, ఆహారనాళికకు సంబంధించిన దీర్ఘవ్యాధులకు గురి అవడం తప్పదు. కాబట్టి శరీరాన్ని క్రమబద్ధంగా పోషించి తమముగ్ధ మోహన లావణ్యానికి ఆరోగ్యం, బలం, సౌష్ఠవం చేకూర్చుకోడానికి తారలు ప్రయత్నించాలి.

తాజ్‌మహల్‌కు సౌకుమార్యం ఎంత అవసరమో బలంకూడా అంతే అవసరం. జీవితాన్ని మరింత క్రమబద్ధం, సహజం చేసుకుంటే నటీనటులు ఎన్నో విధాల ముందుకు పోవడానికి అవకాశముంది. నడవడిని సంస్కరించుకుంటే ఆరోగ్యాన్ని, అందాన్ని హతమార్చి అత్యల్ప కాలంలో అనారోగ్యపు అంద వికారపు కురూపులను చేసే సిఫిలిస్ లాంటి లైంగిక వ్యాధులకు బలికాకుండా తమ దేవతాస్వరూపాలు నటీనటులు కాపాడుకోగలరు. ఎన్నో ఉద్రేకాలతో, ఎంతో ఆకర్షణతో, గడిచే తమ జీవితానికి సమయం కల్పించుకున్ననాడు నటీ నటులు సాధించలేనిదేమీ లేదు. ఈవిషయం మన నటీమణులు, నటులు మనసుకు బాగా పట్టించుకోవాలని నాకోరిక.

('చిత్రజగతి' నుండి)

# శిల్పి

గేయం. కల్పన

ఓ శిల్పి ఓ శిల్పి
లావణ్య శిల్పి
లలితంపు కళలతో
రాణించవోయి ॥
చిత్రాతి చిత్రముల
చెక్కడాల్ పనులుండ
చక్కని చుక్కల నగ్నభంగిమలెల్ల
చిత్రింప నున్నావ ॥ ఓశిల్పి ॥

నీకైన నగిషీల
నాణ్యంపు పనులుండ
విడచేసి వనితల
విన్నాణ భంగిమలు
కఠినంపు శిలలపై
కనుపరుపనున్నావ ॥ ఓశిల్పి ॥
బట్ట కట్టును లేక
బండబూతులతోటి
నవకంపు పడతుల
నాణ్యంపు మానాలు
వివిధ దృశ్యాలలో
విప్పి చూపిస్తావ ॥ ఓశిల్పి ॥
పరదేశ పద్ధతులు
పై పెట్టుకొని నీవు
పరమ పావనమైన
భారతావనిలోన
నీ శిల్పి చాతురి
విన్యాసముల నెల్ల
పడతులను చిత్రింప
పని పెట్టుకొన్నావ ॥ ఓశిల్పి ॥
భారతావనిలోన
వెలలేని విలువగల
మానాల రక్షణకు
ప్రాణాలు విడచిన
వీరనారుల కథలు
వినలేద నీవింక ॥ ఓశిల్పి ॥

శ్రీమతి గంగాధర భట్ల



తండ్రి తన కుమారుని "ఏమిరా రామూ! మీ తరగతిలో అందరిలో సోమరి పోతు ఎవరురా" అని అడిగాడు.

"నాకు తెలియదు నాన్నా!"

"నీకు తప్పక తెలిసి యుండాలి. మిగతా పిల్లలంతా చదువుకుంటూనో వ్రాసు కుంటూనో ఉంటే వాళ్లను చూస్తూ కూర్చునేది ఎవరురా!"

"మాస్టరుగారు నాన్నా!"

'సి'




(గతసంచిక తరువాయి)

ఏవిన్వీధిలో విహారం చేస్తున్నానో తెలియటంలేదు. అనిర్వచనీయానందోత్సాహ డోలికలలో నాజీవి ఊగులాడుతున్నది. నా ప్రాణస్నేహితుడెలావుందీ నాకు తెలియటంలేదు. ఇంటిదగ్గర పొందిన సకలమైన బాధలు ప్రాణాధిక ప్రియుడైన అన్నముందర, ఆహ్లాదకరమైన చంద్రుని శీతలకిరణ ప్రసారంలో, మలయపవనుని మధుగంధాన్ని మధువును గ్రోలినట్లు గ్రోలుతూ, జలతరంగాల నడుమ డోలికగా ఊగుతూన్న ప్రాణమైన జీవనౌకలో ఉన్నప్పుడు, మాయమై స్వర్గసౌఖ్యాలలో మునిగి తేల్తున్నట్లుతోచింది నాకు. ఇంతవరకు జీవితంలో ఏవిధమైన సుఖమూ అనుభవించలేదు. ఆసమయంలో నా ఆనందాన్ని వర్ణించి వ్రాయటానికి నాకు మాటలు దొరకటంలేదు. ప్రకృతి జీవులకెంత హృదయాహ్లాదం కలిగిస్తుందో నాకు కొంతకాలానికి గాని తెలియలేదు. మానవునకు ప్రకృతితో సమానమైనశక్తిగల ఆప్తమిత్రుడు మరెవ్వడూ లేడు. సుఖమయ జీవితానికి ప్రకృతే మూలాధారం. మానవుడు జీవించటానికి; సృష్టిస్థితి లయాలకు గూడా ప్రకృతే ఆధారభూతం. తేజోమయ సౌందర్య రూపరాశి ప్రకృతి కాంత! ఆమె తన ఒడిలో కోటానకోట్ల జీవుల్ని జోకొడుతుంది! అనేకులను తనలో లీనంచేసుకుంటూ, మరి కొందరిని లోకసంచారానికి పంపిస్తుంది. సర్వాంగ శోభితయై ఎల్లప్పుడూ సుందరతర నాట్యవీధుల్లో నటిస్తుంది. తనను ఆరాధించే వారికి ఎల్లప్పుడూ ప్రసన్నచిత్తయై వారి ముందునిలిచి కోర్కె లీడేరుస్తుంది. సుఖంగా జీవితం సాగించే వారికి అధిక సంతోషం చేకూరుస్తుంది ప్రకృతి సుందరి. కాని వ్యర్థ జీవులకు ప్రకృతితో సమానమైన వైరి మఱియొకటలేదు. సమస్తచరాచరులను తన గర్భంలో యిముడ్చుకుంది, సర్వశక్తులు ఆమెలో లీనమైవున్నాయి. దుఃఖోపశమనానికి దీనబంధువు యీ ప్రకృతి కాంత. ఆమె నన్నిప్పుడు తన ఒడిలోకి తీసుకు 'జో' కొడుతున్నది. ఎంతకాలం యిలా ఆలోచిస్తూ కూర్చున్నానో! యశోధరు పిలిచేదాకా నాకుస్మృతిరాలేదు!

'శ్రీధర్! ఎక్కడనుండో ఏడుపు వినబడుతుంది. చూడు!'

ఉలిక్కిపడిలేచి కలయచూచాను. అంతా అరణ్యమయం. నదిగట్టున చెట్లు గుబురుగా పెరిగి వున్నాయి. చంద్రుడు పశ్చిమానికి వ్రాలాడు. ఎక్కడనుంచో సన్నగా ఏడుపు వినిపిస్తున్నది. ఈనిర్జన అరణ్య ప్రాంతంలో అర్ధరాత్రి సమయంలో ఏడ్చేవారెవరా! ఎందుకొరకు విలపిస్తున్నారో అని ఆలోచించాను. నాకేమీ తెలియటంలేదు. యశోధరు పడవను ఒడ్డుకు పట్టించాడు. యిద్దరం దిగాము.

'ఈ అడవిలో గుండానే వినిపిస్తున్నది! ఏమిటో చూసొద్దామురా!' అన్నాడాతడు. మాట్లాడకుండా అతన్ని అనుసరించి పోతున్నాను. ఒకప్పుడు యశో 'దయ్యాలూ భూతాలూ, ఒంటరిగా వున్నప్పుడు మనుష్యుల్ని తమదగ్గరికి రప్పించుకోటానికి ఏడుస్తున్నట్లు ధ్వనిచేస్తాయని, దగ్గిరికి రావటంతోటే అతనిని చంపేస్తాయని చెప్పాడు. యిది గుర్తుకు రాగానే నావళ్ళు పులకరించింది. గుండెవేగంగా కొట్టు

కోవటం మొదలు పెట్టింది. నడుస్తున్న వాడిని వెంటనే ఆగిపోయాను. కాసేపటికి అన్న వెనక్కు తిరిగి చూశాడు.

'అక్కడ నుంచున్నావేం! రా!' అన్నాడు. నాకు మాటపెకిలి రాలేదు. దగ్గరకొచ్చాడు! 'ఎందుకూ ఆగిపోయావు!' నేను మాట్లాడలేదు.

'ఏం భయపడ్డావా!' అని వీపుచరిచాడు.

భయంకొద్దిగా తగ్గి నడకసాగించాను.

మధ్యలో 'యీ ఏడుపు దయ్యందేమో!' అన్నాను.

యశోధరు నవ్వాడు.

'ఎందుకు నవ్వుతావు?'

'దయ్యాలు యిలాగ ఏడవ్వు!'

'ఏమో ఏవి ఏలా ఏడుస్తయ్యో' ననుకున్నాను.

చెట్లసందుగుండా పోతున్నాము. పాములూ తేళ్ల భయం చిన్ననాడే పోయింది. ఇలా అర్ధరాత్రుల్లో నిర్భయంగా సంచారం చేయటం అలవాటుపడ్డది. నాప్రాణ స్నేహితుడి మూలకంగా! ఎన్నిసారులో నేనొక్కడినే ఒంటరిగా తిరిగాను గూడా దుఃఖోపశమనం కలిగేందుకు. దారితెన్నూ లేకుండా ఆచెట్ల మధ్యగుండా ఒక చిన్నబయలు ప్రదేశం చేరుకున్నాము. దూరాన ఏదో ఒక ఆకారం గోచరించింది. దగ్గరికి వెళ్తున్నాము. అదొకమానవాకారమని తెలిసింది. హృదయం వ్రక్కలయ్యే విధంగా ఏడుపు వినిపిస్తున్నది. దగ్గరికి వెళ్లాం. ఆమె ఒక స్త్రీ! ఒళ్ళో ఒక పిల్లవాడు! అప్పుడర్ధమయింది, తన పిల్లవాడు చనిపోయినందు కామె ఏడుస్తున్నదని. ఆదుఃఖం ఎంతటి కటిక గుండెనైనా కదిలించి వేయగలదు. ఆమె మమ్మల్ని చూచి మరీ ఎక్కువగా దుఃఖించ సాగింది.

యశోధరు దగ్గరకువెళ్ళి ఏదో మాట్లాడుతున్నాడు.

నేను ఆమె మాతృత్వపు ప్రేమను, ఆమె ఒడిలోని పిల్లవాడిని చూస్తున్నాను. యీనిర్భాగ్యుడికి దేవతామూర్తియైన తల్లియొక్క ప్రేమాదరణాలు లభించలేదు. తల్లిచేతుల్లో పుట్టిపెరిగి ఆమెచేతుల్లోనే హాయిగా శాశ్వత సుఖనిద్ర జెందుతున్నాడా పసిపిల్లవాడు. తల్లిని చూడటానికైనా నోచుకోలేక పోయాను. దేవతామూర్తి యీదౌర్భాగ్యుని కెలా లభిస్తుంది. మాతృత్వమంతా ప్రేమ స్వరూపంగా మార్చి, తన్నాప్రేమతో నింపి, తనివితీర హృదయానికి హత్తుకుండేటప్పుడు పొందే ఆనందం యీఅదృష్టహీను డనుభవించలేక పోయాడు. నన్నిలా నరకకూపంలో విడిచి తాను హాయిగా శాశ్వతానంద సమాధిలో నిలిచివుంది. తల్లికి బిడ్డపైనుండే మమత, ప్రేమ, కరుణ, జాలి, యివన్నీ యీ మెలో నాకు గోచరిస్తున్నాయి. పదినెలలుమోసి కని పెంచి కాలాని కర్పించిందాశిశువును. ఆమె ఏం చేస్తుంది. కాలం తన భయంకర గహ్వర ద్వారమైన నోరు తెరిచి నాలుక చాచి మదించి మ్రింగుచున్నది. కాలానికి జాలి ఎక్కడుంటుంది. ఎంతవారికైనా, ఎట్టివారికైనా, విచక్షణాజ్ఞానం అవసరం లేకుండా తనలో



రోహిణీవారి 'ప్రతిజ్ఞ' లో సావిత్రి

లీనం చేసుకుంటుంది. తల్లికి బిడ్డను వేరుచేసి ఆయమను దుఃఖ సముద్రంలో ముంచిపోయింది. ఆస్త్రీ దీన దృశ్యాలూ, హృదయ విదారకమైన ఏడుపూ నాహృదయాన్ని గాయపరచినై! మాతా పితృ విహీనుడనై, ఎవ్వరి ప్రేమకు నోచుకోక జీవచ్ఛవంలాగావున్నాను. స్వర్గంలోనో, వాయువులోనో విహరిస్తున్నాయి వారి ఆత్మలు. నన్నుగూడా మీలో కలుపుకోమని అనేకవిధాలుగా ప్రార్థించాను ఏడ్చాను. కాని వాళ్ళకు నామీద దయగలగలేదు. యింకా యీజీవితమంతా దుఃఖసముద్రంలో యీదమన్నారు. అంతవరకూ వారిదరిచేరే అర్హత నాకు లేదేమో!

ప్రపంచంలో ఏజీవి బ్రతికినా ఒక ఆశయం, ఒక లక్ష్యం మీద నడుస్తుంది. అలాగాక ఎందుకూ కొరగాని జీవితమైందినాది. ప్రపంచంలో నేనుఫలానా వాడినని చెప్పుకుండే అర్హత గూడా లేదునాలో. ఎవడినో, ఎక్కడ పుట్టానో, ఎలాపెరుగుతున్నానో, ఇంకా ఎలాబ్రతుకుతానో ఎవరికి కావాలి! జగతిలో నేనొకడినే అనామకుడిని! యిక్కడనాకు శాంతి అనేదిలభించదు. మృత్యువైనా నామీద దయతలచగూడదా! యీకష్టాలు పడుతూ వ్యర్థ జీవితం గడపటానికేనా నన్ను భూమి మీద పడేసి తాను భర్త సన్నిధి కేగింది. తన ఒడిలో హాయిగా ఆడుకుని పాడుకునే అదృష్టం లేకుండా చేసిపోయింది. కాదు నేనే పోగొట్టుకున్నాను. నావంటి నిర్భాగ్యుడింకెందుండబోడు. ధనమున్నంత వరకే దరిజేరుతారు అంతా. తర్వాత ఆదరించే దిక్కు గూడా లేకుండా పోయింది. యీపిల్లవాడి అదృష్టం ఎంతో పోల్చుకో లేకుండా వున్నాను. తల్లి బిడ్డలకు ఎడతెగని సంబంధం కాలప్రవాహం తెంపివేచినా ఆసంబంధం స్వరూపంతో నశించిపోదు. ఆత్మదుఃఖం అలుముకొని అలమటించి పోతున్న ఆదీనురాలి అవస్థ వర్ణించటం అశక్యం. నేనే ఆమెగర్భవాసాన ఎందుకు పుట్టకపోయాను. అలా అయితే కొంతవరకైనా మాతృత్వ ప్రేమ ననుభవించి వుండేవాడిని. యిటువంటి దుఃఖికి అటువంటి సద్గతులు కలుగుతాయా, ఆజీవి ఎవరో! ఎంతపుణ్యం చేసుకు పుట్టాడో! బ్రతికినన్ని రోజులు తల్లి చేతుల్లో పెరిగి ఆమె ప్రేమను సంగ్రహించి, ఆనందంతో తన జీవితాన్ని ముగించాడు. ఆనందంతో అంతం కావటం కన్న ఆరాధించ తగ్గదేది? తన్ను కని పెంచిన తల్లికరచరణాల్లో తన జీవితాన్ని చిరునవ్వుతో ముగించుకున్నాడు. వెళ్తూ తన తల్లి హృదయాన్ని గూడా తీసుకు వెళ్ళాడు. ఇంక తనకావల్సిందేమున్నది. నాజీవికి అంతం ఎప్పుడో అప్పుడే యీదుఃఖ మంతమౌతుంది.



రోహిణీవారి 'ప్రతిజ్ఞ' లో గిరిజ

పూర్వజన్మ అనేది నాకుండినట్లైతే నేనా జన్మలో ఏమాతా పుత్రుల కెడబాటు కల్గించానో ఆఫలితం యిప్పుడనుభవిస్తున్నాను. తల్లికి బిడ్డకు వేరుచేసి తమ కోర్కెలను కొనసాగించుకుందుకు చూస్తారు కొందరధమాధములు. నేనుగూడా వారిలో వాడినేమో! చేసిన పాపానికి ప్రాయశ్చిత్తం అనుభవించక తీరదు. యీకర్మ సిద్ధాంతం నాహృదయానికి హత్తుకుంది. యీసిద్ధాంతం మీదనే జీవితాలు

జరిగిపోతుంటాయి. కొందరు అంతా తమ స్వశక్తి వల్లే అవుతున్నాయనుకుంటారు. అది కేవలం వివేకహీనం. ఏక్షణంలో ఏవిధమైన ఆపద రాబోతుందో లేక సంఘటన జరగబోతుందో, మరునిముషంలో జరగబోయేదేదో తెలుసుకోలేం! దీనింతకూ కారణభూతమైంది ఒకటుండాలి. అదే కర్మసిద్ధాంతం. దీన్నిబట్టే సకల జగత్తూ నడుస్తుంది. చేసిన పనినిబట్టి ఫలితం అనుభవించటం సహజమేకదా! అలాగే యింతకు ముందు చేసిన పుణ్య పాప కార్యాలవల్ల సుఖ దుఃఖాలను అనుభవిస్తాము. సుఖాలలో మనుజుడదంతా తన స్వశక్తిమీద ఆధార పడిందంటాడు. దుఃఖాలలో అంతావిధి అంటాడు. విధియైనా ఏదైనా కర్మ అనే అర్థం. వ్యాపారంలో లాభం సంపాదించితే అదంతా తను కష్టపడి సంపాదించిందంటాడు. నష్టమైతే యితరులమీద పెట్టి ఏవో సాకులు చెపుతాడు. యిదే జీవిత పథంలోగూడా జరుగుతుంటుంది. దుఃఖసమయాల్లో మానవుడు కర్మ సిద్ధాంతాన్ని విస్మరించి తనకు తానోదార్చుకుంటాడు. ఇదే నా పరిస్థితి ఆసమయంలో! కాని విచక్షణా జ్ఞానం నాలో లేదు. యీకష్టాలనుభవించటం పరిపాటౌతున్నది. మితిమీరినప్పుడు మృత్యుశయ్యదగ్గరకు పరుగెత్తుతున్నది. కాని మళ్ళీతిరిగి వస్తున్నది. అందుకు కారణం ఏమో! ఎందువల్ల నా అంతట నేను మృత్యువును చేరలేకుండా వున్నానో! సుఖభోగలతో జీవించేవారికిగాని నావంటి నిర్భాగ్యపు జీవికెందుకు ప్రాణం మీద యింతతీపి. యిది కాలమహిమ అనుకుండేవాడిని.

అప్రయత్నంగా నాకళ్ళవెంబడి నీరు కారుతుంది. నేనది గ్రహించలేదు. యశో నాబుజంమీద చేయివేసి తట్టిలేపేదాకా యీ లోకంలో లేను.

'ఎందుకు ఏడుస్తున్నావ్!'

ఏం చెప్పనూ?

'పాపం! యీమె తన బిడ్డకోసం అల్లాడి పోతున్నది. తన భర్త పోయినదగ్గర్నుంచీ ఆపసికూనను సాకుతూ, తన ఆశలన్నీ అతనిమీదనే పెట్టుకొని వున్నది. కాని ఆమెకోరిక ఫలించలేదు. ఆపిల్లవాడు రెండురోజులు జ్వరంపడి నిన్ననే చనిపోయాడట. అన్నం నీళ్లూ లేకుండా నిన్నటినుంచీ యిక్కడే తన కొడుకుకోసం ఏడుస్తూవుంది. నువ్వెందుకేడుస్తావ్. ఏం జేస్తాం! మానవుడెంతటి వాడైనా కాలానికి లోకువే! ఒకని కొకడు సానుభూతి చూపగలడు కాని చనిపోయినవాడిని బ్రతికించలేడుగదా! మృత్యువు నడ్డుకొనేవాడు లేడు అన్నాడు. యశోధర రుద్ధకంఠంతో మెల్లగా!

నేను కన్నీళ్ళు తుడుచుకొని బయలుదేరాను. యశో నన్ననుసరించాడు. యింటికిచేరిందాకా ఒకరితో యింకొకరం మాట్లాడనేలేదు.

(సశేషం)

---

# జానపదగేయాలు

శ్రీ టేకుమళ్ళ కామేశ్వరరావు

౧

ముద్దు వెంకటస్వామి పదం అనే ఈ జానపద గేయాన్ని తెలంగాణాలో సేకరించేను. ఇది పాటకపు జీవితానికి సంబంధించిన ప్రేమపదం. యువతి తన గాఢానురాగాన్ని పాడుకొంటూంది.

ఓవాలుగన్నులముద్దు వెంకటస్వామి
నిన్ను నేను విడువజాలరా!

ఇంటిముంగల ఇనపరోలు
సేతిన శాబంతి రోకలి
దంచిదంచి నీవంక సూసితే
ధరణిమీద కాలునిలువదు వెంకటస్వామి
నిన్ను నేను మరువజాలరా! ఓవాలు॥

ఉంటే ఈ ఊళ్లో ఉండు
పోతే పొరుగు దేశంవెళ్లు
సుట్టుపట్టల ఏమూలనున్న
సూడకనామనసొల్లదు వెంకటస్వామి
నిన్ను నేను మరువజాలరా! ఓవాలు॥

ఎర్రసెరువువాలుగుముక్కలు
గోలకొండగుల్లసింతపండు
ఆవాలు ధనియాలు వేసి వండితే
ఆవాసనకి ఈసుట్టుతిరిగేవు వెంకటస్వామి
నిన్ను నేను మరువజాలరా! ఓవాలు॥

ఓ అందకాడ! నాకోడెకాడ!
సందెకాడను గోడదూకి
తొంగిచూడ గడబిడాయెను
నా బంగారుమామ వెంకటస్వామి
నిన్ను నేను మరువజాలరా! ఓవాలు॥

నీకువచ్చెను కోరమీసం
నాకు వచ్చెయి కోనాసిగుబ్బలు
మన ఇద్దరి మనసొక్కటైతె
గుడిసెలోకి వెలుగుదూరు వెంకటస్వామి
నిన్ను నేను మరువజాలరా! ఓవాలు॥

౨

జానపదగేయాలలో అన్నిరసాలతోపాటు హాస్యరసంకూడ విస్తారంగానేఉంది. ముఖ్యంగా పెళ్లిళ్లలో వియ్యాలవారినిగురించి పాడేపాటలన్నీ హాస్యపు పాటలే. పెళ్లికాలమందు బావగార్లను, తదితరులను చేస్తూన్న హాస్యం ఈ పాటలో వినండి.

అలికిన పూసిన అరుగులమీద
ఆకుతేలుకుట్టింది నిన్న బావయ్యా
చీపురుకట్టొకచేత దీపమొకచేత
దిగదుడువవచ్చిన చినబావనుకుట్టి
అన్నదమ్ములబాధ తాజూడలేక
అట్టె వెళ్లి పెదబావ నట్టేటిలోదిగును
కానకవారమ్మ కాలువలో దిగును
ఎరుగక వారితండ్రి ఏటిలో దిగును
శతమానాలకు వెళ్లిన చెడేలనుజూచి
కంసాలి గంగయ్య కాలువలో దిగును
అరివేణికివెళ్లిన అక్కలను జూచి
కమ్మరివెంకన్న గుంటలో దిగును

బాసికానికి వెళ్లిన బావలను జూచి
మంగలి సుబ్బయ్య మంటలో దిగును.

### 3

ఇప్పుడు పాడే శంద్రి - బాలయ్య జానపదగేయం ఒక పెద్దపాట. ఇది ఇరవైయో శతాబ్ద ప్రారంభంలో రచింపబడ్డది. దీనిలో పాటకపు ప్రేమికులైన శంద్రి, బాలయ్య తమ అనురాగాన్ని జంటపక్షుల లాగు విపులంగా పాడుకొంటూరు... వినండి.

బా:- నీ లేడికన్నులలోలె శంద్రి
నీ లేతనవ్వులోలె శంద్రి
ఆ తీగ సొగసులోలె శంద్రి
ఆ పళ్ల గుత్తులోలె శంద్రి
నీ నడక జోరులేమె శంద్రి
నీ నడుము సన్నమోలె శంద్రి
రంగు పింగులు సూత్తె రంబలాగున్నావు
రంగం వెళదామోలె శంద్రి.

శంద్రి:- నేకై కాలసిన్నదాన్ని బాలయ్య
నన్ను కంకులు బెట్టకు బాలయ్య
నాకమ్మ, బాబులేరు బాలయ్య
నన్ను ఆరళ్లు బెట్టకు బాలయ్య
నా మేనత్త సాకుతూంది బాలయ్య
నాకు మేనరికమున్నది బాలయ్య
ఇరుగు పొరుగు సూత్తె ఏమనుకొంటారో
ఎంటరాకురోరి బాలయ్య.

బా:- కమ్మోరి బాయికాడ శంద్రి
నువ్వు కడవనెత్తిబెట్టి శంద్రి
సందుగొందులు దాటి శంద్రి
నువ్వు సిందులు దొక్కంగ శంద్రి
నీ కొప్పు తిప్పులు సూసి శంద్రి
నాకోరికలూరేయి శంద్రి
నీకాళ్ల కడియలోలె శంద్రి
గణగణ మోగేయె శంద్రి
గిలుకు మట్టెలతోనె శంద్రి
నువ్వు గిరున తిరిగేవు శంద్రి
సూపులో సూపెడితే సుక్కలాగున్నావు
లక్కరైకలిస్తా శంద్రి

నీలంపు బావిసీలు శంద్రి
నేనిక్కంగా తెచ్చిస్తా శంద్రి
తీగపట్టెడోలె శంద్రి
నేతిన్నంగా శెయ్యిత్తా శంద్రి
నడుము వడ్డాణము శంద్రి
నేనాణెంగ శెయ్యిత్తా శంద్రి
నీసిట్టిముక్కుసూత్తె సిల్కలాగున్నావు
నీరెలిత్తానోలె శంద్రి

నేమరులుగొన్నానోలె శంద్రి
నువ్వుమాయదారివోలె శంద్రి
మత్తుమందు జల్లేవె శంద్రి
నావి ఉత్తమాటలుగావె శంద్రి
నాకెర్రిత్తిపోతూందె శంద్రి
నువ్వు ఎంత పాపివోలె శంద్రి
నేతిలో సెయ్యేసి సందిటలోకొత్తేను
సంకగొడతానోలె శంద్రి.

నేకాపోళ్ల సిన్నోణ్ణి శంద్రి
నేకాపిస్తా పంటలు శంద్రి
నీపాలము నాకియ్యాలె శంద్రి
నీకు పున్నెముంటాదోలె శంద్రి
నీకంచిగడ్డంతాను శంద్రి

నాకబ్రిదూడ మేత్తాదె శంద్రి
నానాగలిదున్నితే నచ్చత్రాలురాలు
నన్నుపెళ్ళాడోలె శంద్రి.

## ౪

గాంధిమహాత్ముని అధ్వర్యాన ప్రజలు స్వరాజ్య రథం లాగేటప్పుడు రచింపబడ్డ రాట్నం పాట ఇది. పనిలోనె మోక్షం కనుగొన మంటూంది ... వినండి.

లేదులేదుసుమ్మి దేనియందున మోక్షం
రాకపోదుసుమ్మి రాట్నాలకాలం
నాకడుపుకి కూడులేకపోదుసుమ్మి
నేకట్టను బట్ట రాకపోదుసుమ్మి లేదులేదు॥

కైలాసువాసుకృప కొంచెమున్నను
నాకేమిలోటులేదు సుమ్మి లేదులేదు॥

ఏకులుతోడిగి సరసరద్రిప్పిన
సన్ననిదారం రాకపోదుసుమ్మి లేదులేదు॥

ఏకులబుట్ట వేళువరాట్నం
చేతనుబట్టిన చేకురుబ్రహ్మం లేదులేదు॥

నాదంబందు లక్ష్యంబిందు
శంభోశంకర నాకేటిలోటు లేదులేదు॥

## ౫

ఇప్పుడు పాడేదొక జోలపాట. రంగదాసు అనే ఆయన రాశాడు. దీనిలోని భావాలు చాల రమ్యంగా ఉన్నాయి.

ఏమే ఓ చిట్టి
ఏడవకేగుకెట్టి
అప్పచ్చినిపెట్టి
నినుపాడుదును జోకొట్టి

అడుగో బూచివాడు
మన అటకమీద ఉన్నాడు
ఏడుస్తేవాడు
నిను ఎత్తుకుపోతాడు ఏమే॥

ఉయ్యాల ఊగిస్తాను
చేటపెయ్యని చూపిస్తాను
నెయ్యిబువ్వ తిను
తాతయ్య నిన్నెత్తుకొను ఏమే॥

అల్లరిచెయ్యకమ్మా
బుల్లిపల్లకి ఇదుగోనమ్మా
అమ్మమ్మ తెచ్చెనమ్మా
నాతల్లి నీకేనమ్మా ఏమే॥

బెల్లము పెడతాను
నీ అల్లరి ఇకమాను
కట్టెతెచ్చినేను
పిల్లిపిల్లను కొడతాను ఏమే॥

ఊష్ కాకి రావె
పెద్దకేకి నెత్తుకుపోవె
శేషశయనరావె
రంగదాసు నేలుకోవె. ఏమే॥

## ౬

హాస్యరసానికి నిదర్శనంగా మరొక పాటను చూడండి. దీనిలో మేనకోడలు మేనమరిదిని చేస్తూన్న వేళాకోళంలో శృంగార హాస్యరసాలు పాలుపంచదారలాగు మిళితమయేయి. పాటవినండి.

మేనత్తకొడుకమ్మ నామేనమరిది
నన్ను చూడవచ్చినరకంలో పడును

వారకన్నుచూపు మారునిరూపు
కదలడు మెదలడు కరుకోలలాగు
ఉలకడు పలకడు ఉలవగింజవలె
చిరునవ్వు ఒళ్లువిరుపు సిమాలరీతి
వెర్రివెర్రి చూపు ఉర్రూత గుటక
చేటకొమ్మున చేరెడు పోసుకొని
సోమాలమ్మగుడికి సోదెకుబోవ
"బతకడని చెప్పండి బావమరుదులకు
దక్కడని చెప్పండి తల్లిదండ్రులకు
అందడని చెప్పండి అన్నదమ్ములకు
నరకమే శరణని నొక్కిచెప్పండి"
అనిసోది వచ్చింది ఇకనేమిసేతు.

(ఆలిండియా రేడియోవారి సౌజన్యంతో)
(ది 31.7-52 ప్రసారం)



# చర్మబాధలకన్నిటికీ

# సైబాల్




చర్మవ్యాధులన్నిటిని శీఘ్రంగా నివారణచేసి, విషక్రిమి నాశనియై త్వరితంగా కుదుర్చుటలో "సైబాల్" ప్రసిద్ధికెక్కింది. కురుపులు, గజ్జి, ఎక్జిమా, స్కాబీస్, మొటిమలు, తామర, కాళ్ల పగుళ్లు, వ్రణములు మొదలైన వాటిని కుదర్చడములో అద్భుతంగా పనిచేస్తుంది.



## బిడ్డల ఆరోగ్యమునకు

## ప్రసిద్ధిచెందినది:

# రమణీస్

# బేబిగ్రైప్






తయారీదార్లు:

## ది సౌత్ ఇండియన్ మాన్యుఫాక్చరింగ్ కో., మధుర.

డిస్ట్రిబ్యూటర్సు:

సీతారామా జనరల్ స్టోర్సు ఏజెన్సీస్ - విజయవాడ, శికింద్రాబాద్, బరంపురము (గంజాం), బొంబాయి.






## కిచ్చడి

1 అశాకు పెసలపప్పు, 2 అశాకులు బియ్యం, లేక నూకలు, రాళ్ళులేక శుభ్రపరచి వుంచుకొనవలయును. లవంగములు 10, ఏలక్కాయలు 10, కాస్త లవంగపట్ట (దాళిచ్చిన్ని) బాణలిలోవేసి కాస్త నెయ్యివేసి, ఎఱ్ఱగా వేయించి తీసి మెత్తగా పొడిచేసి వుంచుకోవలెను. $\frac{1}{4}$ వీశ ఎఱ్ఱగడ్డలు, 1 పలం పచ్చిమిరపకాయలు, కాస్త అల్లం, ఇవన్నీ కోలుగా తరిగి వుంచవలెను. $2\frac{1}{2}$ పలం తెల్లగడ్డలు, (వుల్లిపాయలు) తోలు విడిపించి వుంచవలెను. పైనచెప్పిన నూకలు శుభ్రముగా కడిగి అన్నముచేసి వుంచవలెను. తగినంత పెద్దపాత్రలో పెసలపప్పువేసి కొంతపొద్దు వుడికిన తర్వాత తరిగి వుంచుకొన్న ఎఱ్ఱగడ్డ వగైరాలను, విడిపించిన తెల్లగడ్డలు (వుల్లిపాయలు) అన్నీవేసి బాగా వుడికించవలెను. పెసలపప్పు మెత్తగా వుడికిన తర్వాత వార్చివుంచిన అన్నము, తగినంత వుప్పు - 2 తులములు జీడిపప్పు 4 తులములు నెయ్యి, పొడిచేసివుంచిన మసాలపొడి, కాస్త కరివేపాకు వేసి, అడుగువరకు గరిటతో కలియపెట్టి ఆనుగంటకుండునట్లు సన్నటిసెగలో కలియవుడికించి తీసి వుపయోగించవలెను.

## జామూన్

మైదాపిండి 2 అశాకులు కొలిచి తట్టయందుంచవలెను. 2 అశాకుల పాలు $\frac{1}{4}$ అశాకు అగువరకు ఇగరకాచిదించి, తట్టయందుంచిన పిండినివేసి 1 పలం వెన్నచేర్చి పిండిని ముద్దగా కలుపవలెను $\frac{1}{4}$ వీశ పంచదారలో $\frac{1}{4}$ అశాకు నీళ్ళుపోసి కాచి జీరాచేసి వుంచవలెను. ఆ వెనక బాణలిలో నెయ్యి లేక డాల్డపోసి కాగనిచ్చి, కలిపివుంచిన మైదాపిండిని చిట్టివేగోడీలులాగ, లేక పొడువుగా చేసిననూ చేయవచ్చును. అటులచేసి కాగుచున్న డాల్డాలోవేసి ఎఱ్ఱగా వేయించి తీసి జీరాలో వేయవలెను. 2 గంటలు నానిన తర్వాత తీసి వుపయోగించవలెను.

## విజిటబల్ పులావు

కోసుదుంప కొంత, బంగాళదుంపలు, గెనుసుదుంప 1 టి. ఎఱ్ఱదుంపలు, బీటుదుంప 1 టి. కేరట్ 1 టి, పచ్చి పఠాణి గింజలు $\frac{1}{2}$ అశాకు, దుంప వగైరాలను బద్దలుచేసి వుంచవలెను. పిడికెడు సెనగపప్పు, పిడికెడు వుద్దిపప్పు, చారడు గసగసాలు, 12 ఎండుమిరపకాయలు, కాస్త ఇంగువ, 1 చంచా దనియాలు, లవంగములు 5, ఏలక్కాయలు 5, కాస్త లవంగపట్ట, (దాళిచ్చిని) అన్నీ సువాసనవచ్చు వరకు వేయించి తీసి మెత్తగా పొడిచేసి వుంచవలెను. 1 పలం పచ్చిమిరపకాయలు, అల్లం ముక్కలుచేసి వుంచుకోవలెను. తర్వాత 4 అశాకులు బియ్యం అన్నంచేసి వుంచవలెను. తగినంత పాత్రలో 5 తులములు మంచినూనెవేసి 1 చంచా ఆవాలువేసి చిటపట అనగానే పిడికెడు సెనగపప్పు, 5 పలములు జీడిపప్పువేసి, వేగిన తర్వాత తరిగివుంచుకొన్న బద్దలు వగైరాలనువేసి వుడికించవలెను. మెత్తగా వుడికిన తర్వాత తగినంత వుప్పు, 1 నిమ్మపండు రసము, పొడిచేసిన మసాలపొడి, అన్నీవేసి బాగుగా కలియబెట్టి కొంతసేపు వుడికిన తర్వాత వార్చి వుంచిన అన్నములోవేసి కలుపవలయును.

ఎమ్. ఆర్. సీతమ్మ

# సోవియట్ దేశంలో ఆహారధాన్యాల సమస్య ఎలా పరిష్కారమైంది?

సోవియట్ దేశంలో యుద్ధానికి ముందే ఆహార ధాన్యాల సమస్య చాలవరకు పరిష్కరింప బడింది.

జారిస్టు రష్యాలో ప్రథమ ప్రపంచ యుద్ధానికి ముందు పది సంవత్సరాలలోనూ సగటున ఏడాదికి మొత్తం 400 కోట్లపూడ్ల ధాన్యం (ఒక పూడ్ సుమారు 18 శేర్లు) పండేవి.

సోవియట్ ప్రభుత్వం భూమిని జాతీయం చేసి, రైతులకు వుచితంగా యిచ్చింది. జారుకిందనూ, భూస్వాములకిందనూ చాల హీనంగా బ్రతికిన బీద, మధ్యతరగతి రైతులు తమ కుటుంబాలను బాగా నిలబెట్టుకుని, తమ భౌతిక పరిస్థితులను అభివృద్ధి చేసుకున్నారు. ఈ విషయంలో సోవియట్ ప్రభుత్వం వారికి చాల సహాయం చేసింది; అదివరకి సులభ షరతుల మీద అప్పులిచ్చింది; వ్యవసాయక యంత్రాలను, పనిముట్లను, మంచి విత్తనాలు, ఎరువులను సప్లయి చేసింది.

విదేశ జోక్యందారులు తరిమివేయబడిన తరువాతనూ, అంతర్యుద్ధం ముగిసిన తరువాతనూ సోవియట్ వ్యవసాయం కొద్దిసంవత్సరాలలోనే తన విప్లవపూర్వక స్థాయిని తిరిగి అందుకుంది. సోవియట్ దేశంలో ఆధునిక యంత్రాలు, శాస్త్రీయ వ్యవసాయక పద్ధతుల వినియోగానికి అవకాశమిచ్చిన సమిష్టి వ్యవసాయ పద్ధతిని రైతులు చేబట్టిన తరువాత వ్యవసాయం, ముఖ్యంగా ధాన్యం వుత్పత్తి త్వరితగతిని పెరిగింది. 1940 లో మొత్తం ధాన్యం పంట 720 కోట్లపూడ్లకు చేరుకుంది; 1913 లో కంటే మార్కెట్‌లోకి వచ్చే ధాన్యం వుత్పత్తి సుమారు రెండింతలైంది.

సోవియట్ దేశం మీద ఫాసిజం సాగించిన వినాశనకర దారుణయుద్ధం సోవియట్ వ్యవసాయానికి గొప్ప నష్టం కలిగించింది. శత్రువులు ఆక్రమించుకున్న ప్రాంతాలలోనూ, రిపబ్లిక్కులలోనూ ప్రభుత్వ క్షేత్రాలు, సమిష్టి క్షేత్రాలు, మిషేన్-ట్రాక్టరు స్టేషన్లు నాశనమైనాయి. యుద్ధకాలంలో సాగుకింద నున్నభూమి బాగా తగ్గిపోయింది. పరిశ్రమలు వ్యవసాయ యంత్రాలనూ, ఎరువులనూ వుత్పత్తి చెయ్యడం బాగా తగ్గించి వేశాయి. అన్నిటికంటే ముఖ్యంగా 1946లో సోవియట్ యూరోపియన్ భాగంలో ఒక విశాల ప్రదేశం తీవ్రమైన అనావృష్టికి లోనైంది; ఇది 1620 లో వచ్చిన అనావృష్టికంటే తీవ్రమైనది; సోవియట్ యూనియన్ అవతరించిన తరువాత యింత భయంకరమైన క్షామం ఎన్నడూ రాలేదు.

ద్వితీయ ప్రపంచయుద్ధం ముగిసిన తరువాత తన వ్యవసాయాన్ని పునరుద్ధరించి, అభివృద్ధి చేయవలసిన క్లిష్టసమస్యను సోవియట్ దేశం ఎదుర్కొనవలసి వచ్చింది. 1946-1950 దశకు నాల్గవ పంచవర్ష ప్రణాళిక (యుద్ధానంతరం మొదటిది) యుద్ధపూర్వక వుత్పత్తిస్థాయిని దాటి పోవడానికి వ్యవసాయం, పశుగణం పునరుద్ధరింపబడి, యింకా అభివృద్ధి కావాలనీ, సాధ్యమైనంత స్వల్పకాలంలో ప్రజానీకానికి అపారంగా ఆహారం, తేలిక పరిశ్రమలకు వ్యవసాయక ముడిపదార్థాలు ప్రభుత్వానికవసరమైన ఆహార, ముడిపదార్థ నిలవలు సృష్టింప బడాలని నిర్ణయించింది.

వ్యవసాయంలో ముఖ్య సమస్యగా వుండిన ధాన్యోత్పత్తిని శీఘ్రగతిని పెంపొందించడంపట్ల ప్రధానంగా శ్రద్ధ చూపబడింది. పంటభూమిని విస్తరింప జేయడంతో పాటు, గడ్డిపంటలను వేయడంతోనూ, ఎరువులను, మంచివిత్తనాలను వినియోగించడంతోనూ సక్రమమైన పంటల మార్పిడి పద్ధతి బాగా అభివృద్ధి చేయబడాలనీ, యుద్ధానికి పూర్వం కంటే వ్యవసాయంలో ట్రాక్టర్లు, యంత్రాలు, ఖనిజ ఎరువుల వినియోగం బాగా ఎక్కువ కావాలనీ పంచవర్ష ప్రణాళికలో నిర్ణయింప బడింది.

నాల్గవ పంచవర్ష ప్రణాళిక లక్ష్యాలన్నీ విజయవంతంగా సాధింపబడ్డాయి. ఈ అయిదేళ్ళ కాలం

లోనూ సమిష్టి క్షేత్రాలు బాగా పెద్దవైనాయి; బలపడ్డాయి. వ్యవసాయంలో వస్తు, సాంకేతిక సౌకర్యాలు, వాటిశక్తి బాగా అధికమైంది. ఈ అయిదేళ్ళ కాలంలోనూ ధాన్యం పంటలు పండే భూమి వైశాల్యం నూటికి 20 వంతులు పెరిగింది. వ్యవసాయ క్షేత్రాలలో ట్రాక్టర్లు 536,000 (ఒక్కొక్కటి 15 హార్స్ పవర్ యూనిట్లు) ధాన్యం కోతయంత్రాలు 93,000 ఎక్కువైనాయి. ఇంతేకాకుండా క్షేత్రాలకు అత్యధికంగా యితర వ్యవసాయక యంత్రాలుకూడా లభించేయి. ఈ అయిదేళ్లలోనూ ఎంపికైన విత్తులతో ధాన్యం పంట వేయడం నూటికి 60 వంతులు పెరిగింది; ఇందులో గోధుమ రెండింతలైంది.

వీటన్నిటి మూలంగ ధాన్యం, పారిశ్రామిక్క, గడ్డి, కాయగూరలు, ప్రత్తికాయలు తదితర వ్యవసాయక పంటలు, హెక్టరు వక్కొంటికీ పంట అయితేనేమి, మొత్తంపంట అయితేనేమి త్వరగా ఎక్కువ చేయబడ్డాయి. ధాన్యం వుత్పత్తి యుద్ధానంతరం మూడవ ఏడాదిలోనే పూర్వపు స్థాయిని చేరుకుంది; ఆ తరవాత సంవత్సరాలలో పంట బాగా అధికమై మార్కెట్ సప్లయిలు ఎక్కువైనాయి. 1950 లో మొత్తం ధాన్యం పంట 1940 లో కంటే 34 కోట్ల 50 లక్షల పూడ్లు ఎక్కువైంది; 1952 లో యీపంట 800 కోట్ల పూడ్లు అయింది; ఇందులో అతి ప్రధానమైన గోధుమపంట 1940 లో కంటే నూటికి 48 వంతులు పెరిగింది.

ఒకప్పుడు సోవియట్ దేశంలో ఆహార ధాన్యాల సమస్య చాల క్లిష్టమైన పెద్ద సమస్యగా పరిగణింపబడ్డది; అది యీవిధంగా, పూర్తిగా పరిష్కరింపబడింది.

యుద్ధానికి పూర్వం, యుద్ధం తరవాత సోవియట్ వ్యవసాయం సాధించిన విజయాలు ముఖ్యంగా సోవియట్ ప్రభుత్వ వ్యవస్థవల్లనే సాధ్యమైనాయి; సోవియట్ దేశంలో ప్రభుత్వాధికారం శ్రామిక ప్రజల చేతుల్లోనేవుంది; వారు తమ శ్రేయస్సుకోసం, సమాజమంతటి భౌతిక సాంస్కృతిక జీవన ప్రమాణాభివృద్ధికోసం జాతీయ ఆర్థిక రంగాన్ని నడుపుకుంటారు.

ఈ విజయాలు సమిష్టి వ్యవసాయ పద్ధతివలకూడా సాధ్యమైనాయి; యీపద్ధతి, తక్కువ వుత్పత్తిశక్తి, తక్కువ మార్కెట్. వుత్పత్తి కలిగిన చిన్న చిన్న వ్యక్తిగత కర్షక క్షేత్రాలకు బదులుగా పెద్దస్థాయిలో యాంత్రికమైనట్టి, అధిక వుత్పత్తిశక్తి గలిగినట్టి సమిష్టి వ్యవసాయాన్ని ప్రవేశపెట్టింది.

ఈ విజయాలు, సమిష్టిరైతుల చైతన్యం వల్లనూ, ఉన్నత సాంస్కృతిక స్థాయివల్లనూ కూడా సాధ్యమైనాయి ఈనాడు సోవియట్ దేశంలోగల సమిష్టి రైతులకూ, విప్లవ పూర్వక రష్యాలోని అణగారిన రైతులకూ ఏమీ పోలికలేదు. సమిష్టిరైతులు సోవియట్ సమాజంలో అందరితో సమానమైన సభ్యులు, మొత్తం మీద సమిష్టి రైతులందరూ వ్యవసాయ శాస్త్ర జ్ఞానంలో ఆరితేరినవారు. తమకున్న అపారమైన సాంకేతిక సౌకర్యాలను బాగా వినియోగిస్తూ, తమ సమిష్టి క్షేత్రాలను శాస్త్రీయ పద్ధతుల మీద నడుపుకుంటున్నారు.

సమిష్టి వ్యవసాయదారులనుండి వచ్చినవారూ, సోవియట్ దేశంలో సంఖ్యాకంగావున్న ఉన్నత, సెకండరీ వ్యవసాయక పాఠశాలలలో విద్యనభ్యసించిన వారూ అయిన అనేకమంది వ్యవసాయ శాస్త్రజ్ఞులు, జంతుశాస్త్రజ్ఞులు, వ్యవసాయ యంత్రీకరణ ఇంజనీర్లూ, తదితర నిపుణులు సమిష్టి వ్యవసాయ వుత్పత్తి రంగంలో పనిచేస్తున్నారు. వ్యవసాయంలో సోవియట్ మిచూరిన్ వ్యవసాయ శాస్త్రవిజ్ఞాన విజయాలు విరివిగా ప్రయోగింపబడుతున్నాయి.

పెద్దఎత్తున పారిశ్రామికాభివృద్ధి ఆహారధాన్యాల సమస్యా పరిష్కారానికీ, వ్యవసాయాభివృద్ధికీ గొప్ప సహాయకారి అయింది. సోవియట్ ట్రాక్టరు పరిశ్రమలు 54, 60, 80 హార్స్ పవర్ శక్తిగల ట్రాక్టర్లను వుత్పత్తి చేస్తున్నాయి. ఈ ట్రాక్టర్లుభూమిని బాగా లోతుగా దున్నుతాయి; మట్టిని బాగా సాగుచేస్తాయి. మిషన్ ట్రాక్టర్లు స్టేషన్లలోనూ (ఇవి సమిష్టి క్షేత్రాలకు తోడ్పడతాయి) ప్రభుత్వ క్షేత్రాలలోనూ గల ట్రాక్టర్ల మొత్తం శక్తి 1940 తో పోల్చిచూస్తే నూటికి 59 వంతులు పెరిగింది.

అసంఖ్యాకంగా వున్న కంబైన్ ఫ్యాక్టరీలు అధునాతనమైన ధాన్యపు కోత యంత్రాలను లక్షలకొద్దీ వుత్పత్తి చేస్తున్నాయి; వీటిలో స్వయం చోదిత కంబైన్లు అనేక వేలుంటాయి. ప్రభుత్వ క్షేత్రాలలో ధాన్యం పంటంతటినీ కంబైన్లే కోస్తాయి. సోవియట్ స్టెప్పీ, అడవిస్టెప్పీ ప్రాంతాలలో గల సమిష్టి వ్యవసాయ క్షేత్రాలుకూడా ధాన్యం పంట అంతటినీ కంబైన్లతో కోస్తున్నాయి. పర్వత ప్రాంతాలవంటి కొన్ని ప్రాంతాలలో మాత్రం కంబైన్లను వినియోగించడానికి వీలులేదు. అక్కడ ధాన్యం పంటలో కొద్దిభాగం మాత్రం ట్రాక్టరుకు కట్టబడిన రీపర్ల చేత కోయ్యబడుతుంది. ప్రభుత్వ క్షేత్రాలలోనూ, మిషేన్ ట్రాక్టరు స్టేషన్లలోనూగల కంబైన్ల శక్తి 1940లో కంటె నూటికి 51 వంతులు పెరిగింది.

మిషేన్ ట్రాక్టరు స్టేషన్లకూ, ప్రభుత్వ క్షేత్రాలకూ అత్యధికంగా భూమిదున్నే పరికరాలు, విత్తులు జల్లేయంత్రాలు, యింకా అనేక రకాల వ్యవసాయక యంత్రాలు వున్నాయి. వ్యవసాయరంగానికి అధిక సంఖ్యల్లో మోటారు ట్రక్కులు, స్టేషనరీ ఇంజన్లు, తదితర యాంత్రిక సౌకర్యాలున్నాయి.

సోవియట్ దేశంలో వ్యవసాయక వుత్పత్తిలో విద్యుచ్ఛక్తి ప్రయోగం బాగా ఎక్కువవుతూంది. ధాన్యం వుత్పత్తిలో ధాన్యాన్ని నూర్చడం, ధాన్యం లోడింగ్ తదితరపనులకు విద్యుచ్ఛక్తి విరివిగా వినియోగింప బడుతుంది.

1941 1945 యుద్ధానంతరం సమిష్టి క్షేత్రాలు మూడేళ్ల కాలంలో తమ ఆర్థికరంగాన్ని పునరుద్ధరించుకుని, యుద్ధపూర్వక ధాన్యోత్పత్తి స్థాయిని అందుకోగలిగాయి. అయితే 1918-1920 అంతర్యుద్ధం తరవాత కర్షకుల వ్యక్తిగత క్షేత్రాలకు అతి తక్కువైన విప్లవ పూర్వక ధాన్యోత్పత్తి స్థాయిని అందుకోడానికి ఏడు సంవత్సరాలు పట్టింది.



కృష్ణా పిక్చర్స్‌వారి "అమ్మలక్కలు"లో పద్మిని.

1950తో పోల్చితే మొత్తం ధాన్యం వుత్పత్తి నూటికి 40 నుండి 45 వంతులు పెరగాలని 1951-1955 దశకు అయిదవ పంచవర్ష ప్రణాళికలో నిర్ణయించ బడింది; అంటే ఎటాపంట 1000 కోట్లనుండి 1100 కోట్ల పూడ్లకు పెంచాలన్నమాట; అందులో గోధుమపంట నూటికి 55.65 వంతులు అధికం కావాలి. ఈ నూతన పంచవర్ష ప్రణాళిక ననుసరించి అన్ని వ్యవసాయక పంటలు, ప్రప్రథమంగా ధాన్యం పంట యింకా బాగా ఎక్కువ కావాలి. సోవియట్ దేశాభివృద్ధికి అయిదవ పంచవర్ష ప్రణాళిక మీద సోవియట్ కమ్యూనిస్టు పార్టీ 19 మహాసభ చేసిన ఆదేశాలలో సూచింపబడి యీ కార్యభారం విధిగా నెరవేర్చబడుతుంది.

'టాస్' నుండి

—(౦)—

కథానిక

# మతావేశం

శ్రీ బలిజేపల్లి రాఘవరావు

అది మొగలాయీ చక్రవర్తులలో నగ్రగణ్యుడగు అక్బరు చక్రవర్తి పరిపాలనాకాలం. అక్బరు మతాంతర సహనము జూపి, తాను రాజపుత్ర స్త్రీలను వివాహమాడుట, రసపుత్ర వీరులకు పెద్ద పెద్ద యుద్యోగము లిచ్చుట మొదలగు పనులు తోటి మహమ్మదీయులకు, ముఖ్యంగా మహమ్మదీయ సర్దారులకు యిష్టం లేదు. ఐనను వారికంటె యున్నత పదవులలో నున్న రసపుత్రవీరులకు వారు తల యొగ్గక తప్పిందికాదు.

అట్టివారిలో ముర్తాజ్ ఒకడు. ముర్తాజ్ పరమ ఛాందసుడు. అక్బరు ప్రవర్తన ముర్తాజ్ కేమీ నచ్చదు. ముర్తాజ్ అక్బరు ఆస్థానంలో నొకకవి. అతడెలాగైనా అక్బరనుసరించుచున్న విధానాన్ని మార్చాలని ప్రయత్నిస్తూ వుండేవాడు. కాని అక్బరతని బోధనలను వినకుండా త్రోసి పుచ్చుతూవుండేవాడు. ముర్తాజ్ కు రషీదా యను నొక కుమార్తె వుండేది. ఆమె కూడా ముర్తాజ్ మనస్సు మార్చాలని ప్రయత్నించి, చివరకాయత్నం ఫలించక తన ప్రయత్నాలను మానుకుంటుంది.

ఒకనాడక్బరు కొలువుదీరి వున్నాడు. అతని యాస్థానమందు బీర్బల్, మాన్ సింగ్, తోడర్ మాల్ మొదలుగా గల రసపుత్ర వీరులంతా ఉన్నతాసనములపై కూర్చుంటారు. ముర్తాజ్ మొదలుగాగల మహమ్మదీయ మతాభిమానులు గూడ నొక ప్రక్క కూర్చుంటారు. అక్బరు కావ్య గోష్టి జరుపుతూ తాను క్రొత్తగా సృజించిన మతమగు "దిన్ ఇలాహీ" దాని మూలమంత్రమగు "అల్లాహో అక్బర్" గురించి ఉపన్యాశిస్తూ వుంటాడు. ముర్తాజ్ కు యీ పిచ్చి పిచ్చి వుపన్యాసాలతో పిచ్చెత్తినట్లైంది. వెంటనే యతడు లేచి మహమ్మదీయ మతమునకు సాటియైన మత మీ ప్రపంచమందు మరొకటి లేదనియు, దానిముందీ హిందూ మత మొక తృణప్రాయ మైనదనియు మహావేశముతో నుపన్యశిస్తూ వుంటాడు. అంతటితో నూరుకోనక అక్బరును విమర్శిస్తూ మహమ్మదీయ మతమునకు వ్యతిరేకముగా నడచిన వారికి నరకప్రాప్తి యౌనని అంటాడు. అక్బరాతని అవమాన పరచి, కొలవునుండి బయటకు నెట్టివేస్తాడు.

అక్బరుచే నీవిధముగ నవమానితుడైన ముర్తాజ్ అక్బరుపై నెట్లైన పగసాధింపవలెనని చూస్తూవుంటాడు. ఆకాలములోనే అక్బరు కుమారుడగు సలీము దుర్వ్యసనముల పాలై యక్బరుపై తిరుగుబాటు చేయుటకు యత్నిస్తూ వుంటాడు. ముర్తాజ్ సలీమునకు మంత్రియై యతని నక్బరుపై తిరుగుబాటు చేయవలెనని

బోధిస్తూ వుంటాడు. రషీదా తన తండ్రి నామార్గమునుండి త్రిప్పవలెనని యత్నిస్తూ వుంటుంది. ఒకనాడు రషీదా ముర్టాజ్‌ను తిరిగి అక్బరునే బ్రతిమాలి యతని కొలువులో చేరమని ప్రార్థిస్తుంది. మతావేశములోనుండి కన్నుమిన్ను గానకున్న యాతనికి రషీదా మాటలు చెవిని సోకలేదు. పైగానాతడక్బరును హత్యచేసి తీరుతానని ప్రతిజ్ఞచేస్తాడు. ఆ మాటలువిన్న రషీదా తన తండ్రి మతావేశంతో అక్బరును హత్యచేయునేమో యను భయముతో నాతనిని రక్షించుటకు మగవేషధారిణియై, అక్బరు అంగరక్షకులలో నొకరుగా చేరుతుంది.

సలీము సర్వ ప్రయత్నములుజేసి తండ్రిని కైదుచేయుటకు సిద్ధపడతాడు. కాని సేనాపతియగు మాన్‌సింగు సలీము నోడించి తరిమివేస్తాడు. సలీము పారిపోయిన సంగతి వినగానే ముర్టాజ్‌కూడాపారిపోతాడు. మాన్‌సింగు కల్లోలములనణచి రాజ్యములో శాంతి భద్రతలు నెలకొల్పుతాడు.

పారిపోయిన ముర్టాజ్ అంతటితో తన యుద్రేకము విడువక అక్బరును హత్యచేయుటకై సమయమునకై నిరీక్షిస్తూ వుంటాడు. ఒకనాటిరాత్రి సౌధోపరిభాగమందు వెన్నెలలో అక్బరిటునటు పచార్లు చేస్తూ వుంటాడు. అది జ్యేష్ఠమాస మగుటచే ప్రజలు నిద్రకై యత్నిస్తూ తమ తమ ప్రక్కలపై నిటునటు దొర్లుతుంటారు. కోటదేవిడీయొద్ద పండ్రెండు గంటలు కొట్టిరి. అక్బరింకా పచార్లు చేస్తూనే వున్నాడు. ఇంతలో చేతనొక బాకు పట్టుకొని మెల్లగా ముర్టాజ్ ప్రత్యక్షమౌతాడు. అక్బరింకా యతనిని చూడలేదు. ముర్టాజ్ అక్బరును చిత్రవధ చేయ యత్నిస్తూంటాడు. అక్బరు పరాకుగా నతనినిజూచి భయపడ్డాడు. పరాకుగా, నిస్సహాయ స్థితిలోనున్న యక్బరేమిచేయగలడు? ఇంతలో అక్బరు అంగరక్షకుని వేషములోనున్న రషీదా యచ్చటికివచ్చి నిలుస్తుంది. ముర్టాజ్ తడబడుతూ తన చేతిలోని బాకు అక్బరుపైకి విసురుతాడు. రషీదా అక్బరున కడ్డునిలచి బాకుపోటువలన నేలకొరగిపోతుంది. అక్బరు ముర్టాజ్‌ను కైదుచేయిస్తాడు.

అక్బరు ముర్టాజ్‌కు మరణశిక్ష విధిస్తాడు. గాయపుబాధతోనున్న రషీదా తన తండ్రి వృత్తాంతము, తన వృత్తాంతము చెప్పి, తన తండ్రిని కాపాడమని ప్రార్థిస్తుంది. ఇదియే తన యంతిమ కోర్కె యనిచెప్పి యామె మరణిస్తుంది. తన ప్రాణములను రక్షించుటకు ప్రాణములను కోల్పోయిన యావనిత వృత్తాంతమును వినుసరికి అక్బరు హృదయం కరిగిపోతుంది. అక్బరు ముర్టాజ్‌ను విడిచి పెడ్తాడు. ముర్టాజ్ తన తప్పులను క్షమించమని ప్రార్థించి తన మతావేశంవల్లనే యిదంతా జరిగిందని తలచి తనుకూడా అక్బరు మతము ననుసరిస్తాడు. అక్బరు రషీదా జ్ఞాపకార్థం ఒక సమాధి నిర్మించాడు.

# ప్రేమోపాయనం

శ్రీ సహదేవ తారాదేవి

(గతసంచిక తరువాయి)

చంప:-(దీర్ఘంగా నిట్టూర్చి) అబ్బ! ఎంత భయానక మయిందీ పూర్ణిమానిశి!

చంద్రా:-పిచ్చిదానా, ప్రకృతి నెందుకుదూషిస్తావు? మానవుల్లో పశువాంఛా ప్రకోపమే సమస్త ప్రళయాలకీ మూలం.

చంప:-అక్కా! ఒక్క మాటడుగుతాను దాచక చెబుతావా!

చంద్రా: నీదగ్గరనా నాదాపరికం.

చంప:-నేడు మహారాజు మహిషీత్వాన్నే గడ్డిపోచగా భావించి కాలదన్నావు. ఇంతకన్నా అమూల్యోపాయనం ఎవరుతెస్తారక్కా?

చంద్రా:-(నిట్టూర్పు)

చంప:-నిమిష నిమిషానికీ నిట్టూర్పు సెగలు రేగి నీబింబాధరాన్ని వసివాడిస్తున్నావి. ఎవనిరూపం నీహృదయంలో ఈరాగాగ్నిని రగుల్కొల్పింది?

చంద్రా:-(నిట్టూర్పు)

చంప:-సమస్త ప్రపంచమూ నిద్రాజాగరితమై సుఖస్వప్నాలు కనే సుమశోభనవేళ ఇది. ఇంకా ఎవని కోసం నీకన్నుల నిరీక్షతో ద్వారదేశాల తోరణాలు కడుతున్నావు?

చంద్రా:-ఆరునెలల క్రితం ఒకనాటి మునిమాపువేళ కైలాసనాథుడి గుడికివెళ్లాను. స్వామిని దర్శించి ఇవతలికివచ్చాను. కాసారతీరంలో, స్వచ్ఛ గౌరాంగుడూ, దివ్య తేజస్వీ, అయిన ఒక శిల్పి శ్రేష్ఠుడు.

చంప:-(అదిరిపడి) శిల్పి! నాస్వామికూడా శిల్పియే.

చంద్రా:-ప్రపంచంలో శిల్పులెందరులేరు.

చంప:-ఔను నిజమే. తరువాత.

చంద్ర:-అతడు తదేక దీక్షతో దేవీవిగ్రహాన్ని చెక్కుతుండగా చూచాను. ప్రథమ వీక్షణం లోనే ఎందుకో అతనిరూపం నాహృదయంలో శాశ్వతంగా మలచి వేయబడింది. అతడు నాకేసి కన్నెత్తి చూస్తాడేమోనని చాలసేపు నిల్చున్నాను. కాని అతడు మన ప్రపంచంలోనే లేడు. అతని ఏకాగ్రతకు భంగం చేయడం ఇష్టం లేక చాలసేపటికి ఇంటికి తిరిగి వచ్చాను. అలా పదిరోజులు వరుసగా అదే సమయానికి వెళ్ళి ఆమోహనమూర్తి ప్రోల నిల్చున్నాను. లాభం లేకపోయింది. 4-వ నాటికి ఆయన విగ్రహాన్ని పూర్తిచేసి లేచి నాకేసి చూచాడు. నేను నమస్కరించాను. అతడు విస్ఫారిత నయనాలతో నావంక చూస్తూ "దేశదేశాలు తిరిగాను. కాని ఇంత విలక్షణమూ, మానవాతీతమూ, అయిన సౌందర్యాన్ని ఎక్కడా చూడలేదు. సుందరీ! నీవెవ్వరు?" అని అడిగాడు.

నేను:-తమదాసిని. గణిక చంద్రావళిని.

అతడు:-(నవ్వి) ఒక్కచూపుతో లోకాలు జయించే సౌందర్యం నీది, నీవొకరికి దాసివా! కాని ఏం లాభం. ఈసోయగమంతా నీతోనే నశిస్తుంది గదా!

నేను:-చావుతో నశింపని రూపం కూడా ఉన్నదా స్వామీ!

అతడు:-నీరూపాన్ని శిలాస్థగితం చేస్తే ఈవిశ్వంలో సౌందర్యానికి తలమానికమై, ఆదర్శమై, శాశ్వతంగా నిలచి ఉంటుంది.

నేను:-అయితే, తాము నారూపాన్ని.

అతడు:-ఇంతవరకు దేవీమూర్తులనే కాని మర్త్య కాంతలను మలవలేదీచెయ్యి. నాజీవితమంతా ఒక్క శిల్పకళా సరస్వతికే ధార పోశాను. కానీ నేడెందుకో నిన్ను చూచినప్పటినుంచి ఏదో తెలియరాని మధురభావంతో మనస్సు తలమునకలౌతున్నది. నీమూర్తిని శిలాస్థగితం చేయడానికి చేయి వేగిరపడుతున్నది.

నేను:- నాచిరతపస్సు నేటికి ఫలించింది.

అతడు:- ఎందుకో నీరూపలావణ్య శ్రీ, తొలిచూపులోనే, విద్యుత్ వాహినిలా నన్నణువు అణువునా కదిల్చివేసింది. ఏజన్మాంతర సంబంధమో ఈహృదయాల కలయిక. శిలనే పులకింపజేసే ఈసోయగాన్ని జగద్విఖ్యాతమైన శిల్పకళాఖండంగా సృష్టించి నీకుపాయనంగా సమర్పిస్తాను. ప్రతిఫలమేమిస్తావు సుందరీ!

నేను:- అనాఘ్రాతమైన ఈకుసుమ హృదయాన్ని మీపాదాంకితం చేస్తాను ప్రభూ! స్వీకరిస్తారా?

అతడు:- (ముందుకువచ్చి ప్రేమతో నాచుబుకాన్ని తాకి) అంతకన్నానా, జీవాలతో ఉంటే వచ్చే వైశాఖ పూర్ణిమలోపున క్రాంతినాథుడు తన ప్రేమోపాయనాన్ని నీకుసమర్పించి ప్రతిఫలాన్ని పొందుతాడు. లేదా అతడు మరణించినట్లే భావించు.

చంప:- (అదిరిపడి) క్రాంతినాథుడా!

చంద్రా:- అదేం, చంపా! నీశరీర మిలా చలిస్తున్న దేం, నీముఖమిలా వెల వెలపోతున్న దేం!

చంప:- ఏ - ఏ - మీ లేదు. చి - చిరకాల వియోగ బంధు సమాగమానందంతో నాతనువు నేడీవశమైంది.

చంద్రా:- నీవు క్రాంతినాథుణ్ణెరుగుదువా?

చంప:- ఎ - ఎరుగకేం. కస్తూరీ పరిమళంలా జగజగాల ఆమహాశిల్పి కీర్తి పరిమళిస్తుంటే ఆయన్నెరగనివారెవ్వరు! ఒక్కమాట నీవు నిజంగా అతన్ని ప్రాణాధికంగా ప్రేమిస్తున్నావా?

చంద్రా:- తొలిచూపులోనే అతడు నాహృదయాన్ని హరించాడు. ఈ ఆరు నెలలు నాస్వామికై ఎదురు చూడని ఘడియలేదు. అతని కోసమే, ఆయనమాట యిచ్చి మరచిపోయారేమో ననే భయంతోనే ఆయనెక్కడున్నా ఆయన ప్రతిజ్ఞను జ్ఞాపకం చేయడానికని, ఈవరనిర్ణయోత్సవాన్ని దేశ దేశాల చాటంబంచాను. నేడే ఆఖరు గడువు. దిశలు తెల్లవారేసరికి స్వామి రాకుంటే ఈ ఉంగరంలో గరళమే నాకు శరణం.

చంప:- అబ్బ! పయోముఖ విషకుంభంలా ఈవజ్రం పైకి ఎంత నిర్మలంగా ప్రకాశిస్తోందో, ఏదీ చూడనీ!

చంద్రా:- (తీసి యిచ్చి) ఈవిషం నాలిక తాకిన 3 నిముషాలలో ప్రాణవాయువు తెగిరిపోతాయి. జాగ్రతగా తిరిగి యియ్యి.

చంప:- తిరిగి యివ్వడానికా తీసుకున్నాను. పతి పరిత్యక్తలై, దిక్కులేని నావంటి అభాగ్యులకోసం ఈవిషం. కాని పతిప్రేమను పొందిన నీవంటి వారికికాదు. భగవానునిదయవల్ల నీ ప్రేమ ఆటంకరహితంగా ఫలిస్తుంది.

చంద్రా:- చంద్రుడు ముంగిట వెన్నెలబాట వేస్తున్నాడు. నాస్వామికోసం. దిశలెల్ల కుసుమించి కనువిచ్చి చూస్తున్నాయి నాస్వామి రాకకై చాలాగే. కాని నాస్వామి మాత్రం రాలేదు. (కంటనీరు పెడుతుంది.)

చంప:- (కంటనీరుతో) అక్కా! నీవులోనికివెళ్ళి భగవంతుణ్ణి ప్రార్థించు ఆయన రాకకోసం. నేను వారికోసం వాకిలి కాస్తాను.

చంద్రా:- సరే, వారని తప్ప మరెవ్వరినీ లోనికి రానీయవద్దు. నేను భగవంతుణ్ణి ప్రార్థించి తిరిగి వస్తాను.

(వెడుతుంది.)

[ప్రవేశం శిల్పి, చేతిలో కర్రతో. వెంట ద్వారపాలకులు ముసుగులోనున్న విగ్రహాన్ని తెచ్చి నిలబెడతారు.]

చంప:- స్వామీ! నమస్కారం. (అతనిపాదాలమీద వాలుతుంది.)

శిల్పి:- ఎవరమ్మాయి నీవు? వెచ్చని కన్నీటితో నాపాదాభిషేకం చేస్తున్నావు?

చంప:- ఒక అభాగ్యురాల్ని. నన్ను మీరివదిరకు చూచే ఉంటారు.

శిల్పి:-నీకంఠధ్వని నేనెప్పుడూ వినలేదు.

చంప:-(ఆశతో) పోనీ రూపం.

శిల్పి:-(నవ్వి) కన్నులలో, హృదయంలో, సర్వ నాడులలోనిండి వెలుగుతున్న ప్రేయసిరూపం తప్ప ఇతర ప్రపంచమంతా కటిక చీకటి.

చంప:-అవును. నిజమే, అయ్యో! నాదెంతవెఱ్ఱి! ఎంతవెఱ్ఱి! (ఏడుస్తుంది.)

శిల్పి:-కంఠంలో గాద్గద్యంతో నాపాదాలని కందజేసే వేడి నిట్టూర్పులతో ఎందుకింతగా శోకిస్తావు. ఏకఠినుడు నిన్నింత వలవంత పాలు జేసాడు?

చంప:-విధియే నాయెడ కఠినమయింది. మనసు తెలియరాని బాల్యదశలోనే నేనొక ప్రేమలతను నాటాను. అది ఎన్నో ఝంఝులకి తల ఒగ్గినా ఆశా మహావృక్షాన్ని పెనవేసుకు పెరగసాగింది. నేడు ఉవ్వెత్తుగా ఒకమహా ఝంఝు దాన్ని నేల పాలు చేసింది. దిక్కుమాలిన నేను మాత్రమే మిగిలాను.

క్రాంతి:-ఎంతవిచిత్రం మన యిరువురి జీవితాలు ఒకటే!

చంప:-అవును స్వామీ. కాని పర్యవసానం మాత్రం వేరు.

క్రాంతి:-నేనుకూడా ఒక ప్రేమలతను నాటాను. అది నా ఆశావృక్షాన్ని పెనవేసుకుని కొనలువేస్తూ తీగసాగింది. కాని పుష్పించే సమయానికి నాదురాశా మారుతం దాన్ని పిడుగడచినట్లడచివేసింది. అంధుణ్ణయిన నేనుమాత్రమే మిగిలాను.

చంప:-(అదిరిపడిలేచి ఆవేగంతో) తామ అంధులా! ఏమహాశిల్పి హస్తం రాతికి జీవం పోసి ప్రపంచంలో శిల్పకళకే మార్గదర్శక మయిందో, ఆమహాశిల్పి హస్తానికి నేడూతకర్ర మార్గదర్శక మయిందా! భగవాన్! ఎంతనిర్దయుడివి?

శిల్పి:-విధి ప్రతికూలమయినప్పుడు భగవంతుడు కూడ మానవుణ్ణి రక్షించలేడు. నీవునన్నెరుగుదువా?

చంప:-ఎరుగకేం.. నన్ను నేనెంతబాగా ఎరుగుదునో అంతబాగా ఎరుగుదును. చంద్రావళికి నేను సోదరిని.

క్రాంతి:-అలాగా! అందుకే నీహృదయ మింత నవనీతమృదులం. చెప్పు! పౌర్ణిమా చంద్రుడింకా నడిమింట నున్నాడా?

చంద్రా:-(ప్రవేశం ఆతురతతో) రాత్రి అతిక్రమించినా నాస్వామి ఇంకా రాలేదు. నేటితో నాబ్రతుకింక తెల్లవారినట్లే. (క్రాంతిని చూచి గభాలున ముందుకువచ్చి పాదాలు పట్టుకుని) స్వామీ! ఆరునెలలనుండి దివానిశలు మీకై చూచి నాకన్నులు కాయలు కాచాయి. నేటికి అదృష్టం ఫలించింది. ఇకమిమ్మే విడువను. నాకన్నీటి పన్నీటితో మీపాదాభిషేకం చేస్తాను. హృదయ సుమంతో పూజచేస్తాను. కనుల ప్రేమ జ్యోతితో నీరాజన మిస్తాను. వలపు టూర్పుల వింజామర వేస్తాను. అధర మధువు పానీయ మిస్తాను. అనుగ్రహించండి.

క్రాంతి:-(ఆమెను లేవనెత్తి) సుందరీ! ఆరునెలల క్రితం క్రాంతినాధుడు నీప్రతిరూపాన్ని మలచి తెస్తానన్నాడు. ఇదిగో నీ ప్రేమోపాయనం. ముసుగుతీసి చూడు.

చంప:-(ఉత్కంఠతో ముసుగుతీసి చంప) అక్కా! చూడు ఈకన్నులకు రెప్పలల్లార్చే గుణమూ, ఈపాదహస్తాలకి చలనమూ, ఈమోవి కెంజాయకు మాటల తియ్యదనమూ, ఈస్వర్ణతను కాంతికి కుసుమ సౌకుమార్యమూ, అబ్బితే దీన్ని నీవు కాదని ఎవ్వరనగలరు? నీదివ్య సౌందర్యానికి నేడుగదా శాశ్వతత్వము చేకూరింది!

చంద్రా:-మహాశిల్పులయిన తమ హస్త స్పర్శకు పులకించి రూపొందిన ఈప్రతిమా సుందరి ధన్యురాలు! ఉదాత్తమైన మాప్రేమార్ద్ర హృదయమే ఈసుందర శిల్పసృష్టికి మూలకారణం. జగము ఉన్నంతవరకూ మనప్రణయగాధ నీప్రతిమా సుం

దరిప్రపంచానికి చాటి చెపుతుంది ఇంతకన్నా అమూల్యమైన ప్రేమోపాయనం ఎక్కడుంది ?

శిల్పి:-(నిట్టూర్చి) ఎక్కడాలేని మాట వాస్తవం. దీని సృష్టితో నాజీవితమే గాడాంధతమో విలీనమై పోయింది.

చంద్రా:-కాదు స్వామీ! దీనిసృష్టితో మన జీవితం జిలుగు వెలుగులతో ఆనంద నృత్యం చేస్తుంది.

శిల్పి:-నీకు తెలియదు పిచ్చిదానా ఇలా చూడు ఇదే నాఆఖరు శిల్పకళాసృష్టి. ఈకన్నులు దివారాత్రాల వెలుగు నీడలు కాని ప్రకృతి రామణీయకతను కాని చూడలేవు, నేను అంధుణ్ణి.

చంద్రా:-(అతని కన్నులలోనికి తేరిచూస్తూ) అసంభవం. తేజస్వంతలయిన ఈకన్నులకంధత్వమా! పరిహాసమా ప్రభూ!

చంప:-(ఏడుస్తూ) అక్కా! ఆయనమాట నిజం.

శిల్పి:-గుర్వాజ్ఞాతిక్రమణం చేసి ఈకష్టాన్ని కోరి తెచ్చుకున్నాను. తపసంపన్నులయిన నాగురువును ఒకనాడు నేను ప్రశ్నించాను. "గురూ ఇంత సౌందర్యాన్ని సృష్టించే శిల్పిహస్తానికి తన జీవం పోసేశక్తి ఎందుకులేదు?" అని. ఆయన నాకొక మంత్రముపదేశించి "ఈ మంత్రబలం చేత నీసృష్టికి జీవచైతన్యం కలుగుతుంది. ఒక్క నిముసం మాత్రం. అపచారం జరిగిందా ఇక నీవు చూడలేవు." అన్నారు. తరువాత ఎన్నో ప్రతిమలను మలచాను. కాని జీవం పోయాలన్న వాంఛ కలుగలేదు. కాని నాచేతి సమ్మెట పోటుతో నీవంపు సొంపుల్ని దిద్ది తీర్చుతున్నప్పుడు, జడమైన నీప్రతిరూపం సహితం నన్నీవశుణ్ణిచేసింది. ఒక్కసారి ఈసౌందర్యానికి జీవచైతన్యమిచ్చి చూడాలనే కాంక్ష బలీయమైంది. శుచినై, గురువును ధ్యానించి మంత్రజపంచేసాను. అంత వరకు నిశ్చలమైనిల్చున్న ఆస్వర్ణ ప్రతిమ నవనాడులలో కవోష్ణరక్తం పొంగెత్తి జీవచైతన్యంతో తొలుకాడుతూ భూమికి దిగివచ్చిన శంపాలతలా మెరవసాగింది. విలాసలాలసదృష్టితో నన్ను చూచి "స్వామీ" అని పిలిచింది. నేను నిలువునా చలించి ఏమిచేస్తున్నానో తెలియకుండేనే గాలికి వణకే రోజాలా చలిస్తున్న ఆపెదివుల్ని ముద్దాడాను. అంతే-నాకళ్ళు జిగేలుమన్నాయి. చావుబ్రతుకుల సందిగ్ధావస్థలో నున్న నాకు శిష్యులే ఇన్నాళ్ళూ ఉపచారం చేసి నేటికి నీసన్నిధిని చేర్చారు.

చంద్రా:-(ఏడుస్తూ) స్వామీ! స్వామీ! నాపై ప్రేమ నిన్నంధుణ్ణి చేసిందా!

చంప:-భగవాన్, మానవసహజమైన చాపల్యానికి ఇంతకఠిన దండనమా!

శిల్పి:-అవును. క్షణిక చాపల్యానికి తలయొగ్గి శాశ్వత ప్రేమను కోల్పోయాను. చంద్రా నన్నుమరచిపో సెలవు.

చంప:-(ఆవేగంతో అడ్డువెళ్ళి) ఎక్కడికి స్వామీ!

చంద్రా:-(ఆవేగంతో) నేను లేకుండా ఎక్కడికి స్వామీ!

క్రాంతి:-ఏచీకటినుంచి వచ్చానో అక్కడికే.

చంద్రా:-ఇచ్చినదాన్ని తిరిగితీసుకోవడం చంద్రావళి ఎరుగదు. మీప్రేమోపాయనానికి ప్రతిఫలంగా నన్ను స్వీకరించండి.

కాంత్రి:-అంధుణ్ణి! నేను నీ ప్రేమకపాత్రుణ్ణి. నన్నుపోనీ!

చంద్రా:-తాము అంధులా! చంద్రావళి కన్నుల వెలుగున్నంతకాలం తామంధులేలాగవుతారు. మనయిరువుర మొక్కటి. నాకులేని అంధత్వం మీకెలావస్తుంది. స్వామీ అడుగు కదిలారా మీపాదాలముందు ప్రాణాలు విడుస్తాను, (కాలిమీద పడుతుంది.)

చంప: నాసోదరిని విడిచి నేను జీవించను. మా ఇరువురి మరణాన్ని చూచి వెళ్ళండి.

క్రాంతి:-(లేవనెత్తి గాద్గద్యంతో) చంద్రా! నేడు నీప్రేమబంధంతో నన్ను కదలకుండాకట్టి వేశావు.

జ్యోతిర్మయివి · నీవు మార్గదర్శినికాగా ఇక ఈ ఊతకర్ర ఎందుకని? (పారేస్తాడు.)

(ప్రవేశం విజయుడు క్రాంతినాధుడుని వెనుకనుండి)

విజయు:-అబ్బ! మేలుకుని ఎంతవెతకినా మీజాడే లేదు (క్రాంతిచూసి గుర్తుపట్టి ఆనందోద్రేకంతో) భలే! వెతకబోయిన తీగె కాలికే తగిలింది! చెల్లీ! ఇదుగో నీస్వామి! అదేం అలా వెల వెల బోతున్నావు. ఎవరి అడుగు జాడల ననుసరిస్తూ అపవాదులకు జంకక ప్రాణాలకు · తెగించి దేశ దిమ్మరివైయ్యావో ఆనీస్వామి ఎదుటే ఉంటే గుర్తుపట్టలేక పోతున్నావా!

చంప:- అన్నా నీది పొరపాటు.

విజ:-అసంభవం. నేను గుడ్డివాణ్ణనుకున్నావా! అతని కుడిచెంపమీద మచ్చే అతన్ని పట్టి యిస్తుంది. (ఆమెను క్రాంతి నాధుని ముందరికీడ్చి) బావా! నీ భార్య అభాగిని చంప ఇదుగో! సర్వము నీవే అని నమ్మి నీకై ఇల్లు వీడిన ఆమెను నీట ముంచినా పాలముంచినా నీదే భారం.

క్రాంతి:- (విస్తుపోయి) మీరు నిజంగా చంపావిజయులా!

విజ:-భలే! ఎదురుగా ఉన్న మమ్మల్నే గుర్తుపట్టలేక పోతున్నావా? పోనీ చిన్నవాడే బిడ్డనిచ్చి పెండ్లి చేసిన మా అమ్మ నీ అక్క భాగీరథినీ మర్చిపోయవా? శిల్ప కళాసేవకై ఇల్లు వీడడంకూడా మర్చిపోయావా?

క్రాంతి:-క్షమించు నేనంధుణ్ణి.

విజయు:-అయ్యో! బావా! నీ వంధుడ వెలాగయ్యావు?

క్రాంతి:-విధివశాత్తు. సరేదానికేంగాని మీరిక్కడికెలా వచ్చారు?

విజ:-నిన్ను వెతకుతూ చంపా, ఆమెను వెతకుతూ నేనూ అదృష్టవశాత్తు నేడిక్కడ తారసిల్లాం!

క్రాంతి-:చిత్రం. చంప నాభార్య అయితే చంద్రావళి సోదరి ఎలాగయింది?







అపరిండియావారి 'నాయిల్లు' చిత్రంలో ఒక సన్నివేశం.



చంప:-(అతని కాళ్ళమీదపడి ఏడుస్తూ) స్వామీ! ఎప్పుడైతే చంద్రావళి నోట మీ ప్రేమగాథ విన్నానో అప్పటి నుండే మీ కడ్డురాకూడదని నిశ్చయించుకున్నాను. మీరు అంధులని తెలిసి నన్ను గుర్తుపట్టలేరని అసత్యమాడాను. మా అన్నే రాకుండా ఉంటే మీ పాదరజాన్ని కడసారి కౌదలదాల్చి, అజ్ఞాతంగానే వెళ్ళిపోయి ఉండేదాన్ని. కాని-

చంద్రా:-(అంతవరకు నోటమాటరాక విస్తుపోయి చూస్తూ హఠాత్తుగా) అబ్బా! చంపా! నీ హృదయమింత గంభీరమూ, ఉదాత్తమూ అనుకోలేదు. ఈ విషయం నాతో ముందే ఎందుకు చెప్పలేదు. చంద్రావళి నీభర్త నపహరించేటంతటి నీచురాలు కాదు. స్వామీ! ఇదుగో మా ధర్మపత్ని చంప. మీ యిరువురి దాంపత్యం ధర్మబద్ధమైంది. ఆమెననుగ్రహించి నన్ను కడసారి ఆశీర్వదించండి.

క్రాంతి:- (నిట్టూర్చి) పెదవికి పాత్రకు మధ్య ఎంత విపర్యాసం!

చంప-:(ఆ వేగంతో) కాదు! ఎప్పటికీ కాదు. మీ పెదవికీ పాత్రకూ మధ్య నేనెప్పుడూ ఆటంకం కాదు. నేను జీవించియుండగా మీ ప్రేమ పుష్పించదని నాకు తెలుసు. చంద్రావళి మిమ్మ చేరదని నాకు తెలుసు. మీ సుఖంకోరి ఆనందంతో ప్రాణాలు వదిలేస్తాను. (ఉంగరంలో గరళం మింగేస్తుంది)

చంద్రా:-అయ్యో! సోదరీ! ఎంతపని చేశావు (ఏడుస్తుంది)

క్రాంతి:-విజయ, ఏమిటది?

చంద్రా:-(ఏడుస్తూ) ఇంకేముంది ఉంగరంలో గరళాన్ని మింగేసింది!

క్రాంతి:- ఆ! ఆ! ఆ!

విజయ:-చెల్లీ! ఎంతపని చేశావమ్మా! (లేవనెత్తబోయాడు)

చంప:-ఓ! ఒద్దు! నన్ను లేవనెత్తవద్దు బ్రతికియున్నప్పుడు నా స్వామి పాదరజానికి నోచుకోకపోయినా అంతిమసమయాన్నయినా ఆ అదృష్టం దక్కింది. అక్కా! నీదగ్గర ఉంగరం తీసుకున్నప్పుడే మరణింప నిశ్చయించుకున్నాను. నీవు ఒకనాడు నామానప్రాణాలు కాపాడావు. నేడు ప్రాణాలిచ్చి నీబుణవిముక్తనయ్యాను. స్వామి! కడసారి నన్నాశీర్వదించండి. (చచ్చిపోతుంది.)

# ★ సైకిల్ సరదా ★

కుమారి రమ

నేనవికా లేజీలో చదివేరోజులు. మా యింటికి కాలేజికి దాదాపు రెండుమూడు మైళ్లుంటుంది. రోజూ నడిచిపోలేక బండి చేసుకపోయేదాన్ని. దానికి రోజుకు రూపా యిన్నరవుతుంది. నెలకు ముప్ఫైరూపా యలదాకా ప్రయాణానికేపెట్టి ఇహ కాలేజీ ఫీజు ఏం చెల్లించను? పుస్తకాలేంబెట్టి కొనేది? మానాన్న పెద్ద గవర్నమెంటు ఆఫీసరు గాదు. లక్షాధికారి అంతకన్నా కాదు. రిక్షా చేసుకపోదామంటే ఆవూళ్లో అవి మచ్చుకైనా కన్పించవు.

మా క్లాసులో వనజ అనే అమ్మాయి వుంది. ఆమె రోజూ సైకిల్ మీద కాలేజీ కొచ్చేది. వీధిలో సైకిల్ మీద రివ్వున జనాన్ని దూసుకుంటూ పోతుంటే వీధిలో వాళ్లకళ్లన్నీ ఆమెవేపే కేంద్రీకరింపబడేవి. నాకో ఆలోచన తట్టింది, నేనూ ఓసైకిలు కొనుక్కుంటే? యీ విషయం మానాన్న గారికి చెప్పాను. మా అమ్మ అబ్జెక్టు పర్చింది. "ఆడవాళ్లేమిటి వీధులవెంట సైకిళ్ల మీద తిరగడమేమిటి? ఎవరన్నా చూస్తే ఏమనుకొంటారు! మా రోజుల్లో ఇవన్నీ ఎరుగుదుమా" అంది మాట సాగదీస్తూ. నాకు చర్రుమంది. ప్రతీదానికీ ఇంతే యీమె. "ఎవరేమనుకొంటే నాకేం. మన వీలునుబట్టి మనం చూచుకోవాలిగాని" అన్నాను కోపంగానే. మానాన్నగారికిది నచ్చినట్లుంది. "సరే కనుక్కుంటాలేరమా" అని బజారెళ్లిపోయారు. ఆరోజు రాత్రి ఆయన యింటికి రాగానే ఆత్రుతతో అడిగాను. సైకిల్ సంగతేమైనా కనుక్కు న్నారా అని. "ఏజంటును కనుక్కొన్నా నమ్మా, తెప్పిస్తానన్నాడు. వారం పది రోజుల్లో వస్తుందిలే" అన్నారు.

ఆ వారంరోజులూ ఎలాగో కాలం వెళ్లబుచ్చాను. కాని సైకిల్ రాలేదు. మా నాన్నగార్ని రెండుమూడు సార్లడిగాను. కాని ఆయన వస్తుందిలే అంటూనే వున్నారు. నాకో అనుమానమేసింది. అసలీయన ఏజంటుతో చెప్పారో లేదోనని. ఆ రాత్రి మా నాన్నగారితో మరొకతను వచ్చాడు. ఏదో మాట్లాడుకొంటున్నారు చిన్నగా. నాకు సరిగా వినపడలేదు. కొంత సేపయింతర్వాత ఆ వ్యక్తి వెళ్లుతూ పెద్దగా "ఇక ఆలస్యం జరగదులెండి. నాలుగయిదు రోజుల్లో వస్తుంది" అని వెళ్లిపోయాడు. యింతలో నాన్న యింట్లోకి వచ్చారు. ఆదుర్దాగా అడిగాను "ఎవరు నాన్నా ఆయన" అని. "ఆయనేనమ్మా ఏజంటు" అని లోపలికెళ్ళారు. అనుకున్నట్టుగానే వారంరోజుల్లో సైకిల్ వచ్చేసింది. ఆ సంతోషంలో ఆ రోజు నాకు ఆకలేలేకాలేదు. ఇంతకీ నాకు అంతవరకూ సైకిల్ తొక్కడం చేతగాదు. ఇక అప్పుడు నేర్చు

కోవాల్సొచ్చింది. మా తమ్ముడి సహాయ్యంతో రెండు రోజులు ఎంతో కష్టపడి నేర్చుకొన్నాను. ఒక్కసారిగూడ క్రింద బడకుండా నేర్చుకోగల్గినందుకు మానాన్న నన్నభినందించారు. క్రమంగా జనం తిరిగే చోటగూడ సైకిల్ త్రొక్కడం నేర్చుకొన్నాను. వారం రోజులు దానితో కుస్తీ బట్టిన తర్వాత యిక కాలేజీకి వేసుకపోవచ్చునని తోచింది. యింకేం ఆ మర్నాడు సైకిల్ మీదే బయలుదేరాను కాలేజీకి. కొంతమంది కుర్రాళ్లు వెనుక నుండేవేవో వాగారుకాని నేను వాళ్లనసలు కేర్ చెయ్యలేదు. కాలేజీకి చేరుకొన్నాను. బయట సైకిలుంచి క్లాసులో కెళ్లి కూర్చున్నా. క్లాసులో వున్నంతసేపూ సైకిలుమీదేవుంది నాధ్యాసంతా. ఎప్పుడు బెల్ కొడతారా ఎప్పుడు సైకిలెక్కి యింటికి పోదామా అని. లెక్చరరు చెప్పేదిగూడ వినడంలేదు. ఆఖరి కెలాగో బెల్ వినపడింది. వెంటనే సంతోషంతో పుస్తకాలు తీసుకొని లేచాను. "సిడ్డవున్ ప్లీజ్" అని లెక్చరరు కేకేశారు. క్లాసంతా గొల్లుమంది. అప్పటికి వులిక్కిపడి యీ లోకంలోకొచ్చి పడేసరికి లెక్చరరు ఏదో యింకా చెబుతూనే వున్నారు. అంతా శ్రద్ధగా వింటున్నారు. క్లాసుధ్యాసేలేని నేను యీ విషయం తెలియక బెల్ కొట్టగానే లేచేసరికి యీ గొడవ జరిగింది. నేను మెదలకుండా మళ్లా కూర్చున్నా! లెక్చరరును స్టూడెంట్సుని తిట్టుకొంటూ. ఒకో నిముషం ఒకోగంటలా తోస్తూంది నాకు. చివరికెలాగయితేనేం పదినిముషాలు కూర్చోబెట్టి వదిలాడు క్లాసుని. నేను గబగబా వెళ్లి సైకిలు తీసుకొని గేటుదాకా నడిచి వాహనాన్నధిరోహించాను. కొంత దూరం పోయింతర్వాత ఒకరిద్దరు కుర్రాళ్లు నన్ను వెంటాడుతున్నట్లు తోచింది. నాకు భయం వేసింది. సైకిలు మరోవీధిలో కొచ్చింది. ఆ వీధి అంత వెడల్పయింది కాదు. ఇంతలో ఎక్కడినుండి వచ్చిందో ఒకలారి ఎదురుగా వస్తున్నది. దానికి తగ్గట్లుగా వెనుకనుండి మరోబస్సు వస్తున్నట్లు హారన్ వినిపించింది. సైకిలు ప్రక్కకు తీయటానికి ప్రక్కనా మురికికాలవవుంది. దిగుదామంటే టైములేదు. లారీవచ్చేసింది. ఎదురుగా స్టూడెంట్సు నవ్వుతున్నట్లనిపించింది. నాకు వళ్లంతా చమటపోసింది. గుండె దడదడ కొట్టుకోసాగింది. లారీ మీదికొచ్చేసింది. వెనుక బస్సుగూడ సమీపించింది. ఎటుప్రక్కకు పోవడానికి వీలుబడలేదు. అంతే కళ్లుతిరిగినయ్. రెండు చేతులు వదిలేశాను ఒక పెద్ద కేకవేసి. అంతే స్మృహతప్పిపోయింది. మళ్లీ నేను కళ్లు తెరిచేసరికి హాస్పిటల్లోవున్నాను. నర్సు కట్టు కడుతూవుంది. లేవబోయాను, కాని కళ్లు తిరిగిపడిపోయాను. దేహమంతా బాగా దెబ్బలు తగిల్నాయ్. ప్రక్కన మా అమ్మ ఏడుస్తూ కూర్చుంది. "నేను మొదటనే

చెప్పానమ్మా ... ఆడవాళ్లకు సైకిళ్లెందు కని వింటేగా'' అని. మా నాన్న తమ్ముళ్లూ అంతా అక్కడే వున్నారు. డాక్టరువచ్చి ఫరవాల్లేదనిచెప్పి వెళ్లిపోయారు.

నెలరోజులు హాస్పిటల్లోనే వున్నాను. డాక్టరుచూచి యిక యింటికి వెళ్ళవచ్చు నన్నాడు. బండిమీద యింటికి చేరు కొన్నాను.

పదిరోజులు గడచినయ్. ఒక రోజు దేనికో సామాన్లగదిలో కెళ్ళాను. అక్కడ నా సైకిలు తాలూకు హేండిలూ, చక్రాలూ సీటూ వగయిరాలు విడివిడిగా పడివున్నయ్. అప్పటికి నాకు పూర్తిగా సైకిల్ మోజు తీరి పోయింది. విరిగిపోయిన ముక్కలు నాకు ఫక్కున నవ్వినట్లగుపించాయ్. అంతే మళ్లీ ఇంతవరకు సైకిల్ పేరు తలపెడితే ఒట్టు!



జయంతి ప్రొడక్షన్స్‌వారి

“ అమరకవి ”

( తెలుగు )

చిత్రములో

త్యాగరాజ భాగవతర్,

రాజకుమారి, సరస్వతి.




**సోదరికం:-**

గజానన ప్రొడక్షన్స్‌వారి 'సోదరికం' విడుదలకు సిద్ధంగానున్నదట. యస్. వరలక్ష్మి, సూర్యకాంతం, గిరిజ, కాస్యప, రేలంగి మొదలగువారు నటించారు. రచన సదాశివబ్రహ్మం, దర్శకులు కె. రామచంద్రరావు అండ్ వేంబు.

♦ ♦ ♦

**పుట్టిల్లు:-**

రాజాప్రొడక్షన్స్‌వారి చిత్రం. ఫిబ్రవరి రెండవ వారంలో విడుదలకాబోతున్నదని వార్తలు. నూతన తార జమున, సూర్య శ్రీ, రాజారావు మొదలగువారు నటించారు. నిర్మాత: దర్శకుడు, డాక్టర్ రాజారావు.

♦ ♦ ♦

**చండీరాణి**

భానుమతి నిర్మిస్తున్న మూడు భాషల చిత్రం. వారి స్వంత భరణీస్టుడియోలో షూటింగు జరుగుతోంది. యన్. టి. రామారావు, భానుమతి, రంగారావు మొదలగువారు నటిస్తున్నారు. రచన సముద్రాల.

♦ ♦ ♦

**పెద్దమనుష్యులు**

శ్రీ కె. వి. రెడ్డిగారి దర్శకత్వంలో వాహినీ పిక్చర్స్‌వారు నిర్మిస్తున్న చిత్రం. నిర్మాణం చురుకుగా సాగుతున్నది. శ్రీరంజని, కాస్యప, గౌరీనాథశాస్త్రి మొదలగువారు నటిస్తున్నారు.

♦ ♦ ♦

**మేనరికం:-**

జంపన & నందీవారి చిత్రం. బొంబాయి కెమారామన్ శ్రీ వి.యన్. రెడ్డిగారి ఛాయాగ్రహణం యీ చిత్రానికి ఒక ప్రత్యేకత. జి. వరలక్ష్మి, నారాయణరావు, విద్యావతి మొదలగువారు నటిస్తున్నారు. దర్శకుడు రచయిత జంపన.

♦ ♦ ♦

**చంద్రహారం:-**

విజయావారి బ్రహ్మాండమయిన చిత్రం. యన్. టి. రామారావు, శ్రీరంజని, సావిత్రి మొదలగువారు నటిస్తున్నారు. దర్శకుడు కామేశ్వరరావు.

♦ ♦ ♦

**కన్నతల్లి:-**

ఇది డైరెక్టర్ ప్రకాష్‌గారి స్వంత చిత్రం. స్వంత స్టుడియోలో తయారగుచున్నది. జి. వరలక్ష్మి, నాగేశ్వరరావులు నటిస్తున్నారు.

♦ ♦ ♦

**కన్నకడుపు:-**

ప్రసాద్ ఆర్ట్‌ప్రొడక్షన్స్‌వారి చిత్రం. ఇందులో కుమారి, పుష్పవల్లి, రంగారావు, శ్రీరామమూ_

గారలు నటిస్తున్నారు. సంగీతదర్శకత్వం: రాజేశ్వ్రరావు. దర్శకుడు ప్రసాద్.

♦ ♦ ♦

రామ్‌నవమి:-

ఈ చిత్రమును అంబా పిక్చర్స్ అనే నూతన సంస్థ ప్రఖ్యాత కెమెరామన్ శ్రీ. వి. యన్. రెడ్డిగారి దర్శకత్వము క్రింద నిర్మించబోతున్నదట.

♦ ♦ ♦

నా చెల్లెలు:-

అశోకా వారి చిత్రం చిత్రం. బాగున్నదని వార్తలు. జి. వరలక్ష్మి, బలిజేపల్లి, అమరనాథ్ మొదలగువారు నటించారు.

♦ ♦ ♦

వదినె, గరల్:-

ఈ రెండుచిత్రాలు ఎ. వి. యమ్. వారిచిత్రాలు.



ప్రకాష్ ప్రొడక్షన్స్‌వారి 'కన్నతల్లి'లో నొక సన్నివేశం

బ్రతుకు తెరువు:-

భాస్కర్ ప్రొడక్షన్స్‌వారి చిత్రం. దర్శకుడు రామకృష్ణ. ఇందులో నాగేశ్వరరావు, శ్రీ రంజని, సావిత్రి మొదలైనవారు నటిస్తున్నారు. సముద్రాల వారి రచన, ఘంటసాలవారి సంగీతం యీ చిత్రానికి ప్రత్యేకత.

♦ ♦ ♦

'వదినె'లో కన్నాంబ, పండరీబాయి, సావిత్రి, నాగేశ్వరరావులు నటిస్తున్నారు. దర్శకుడు నీలకంఠన్. మార్చి నెలలో విడుదల కావచ్చునట.

'గరల్' మూడుభాషల చిత్రం. దర్శకుడు యమ్. వి. రామన్. అంజలి, నాగయ్య, రామారావు మొదలగువారు నటిస్తున్నారు.

———o———

## చిత్రసమీక్ష

**పరదేశి:-**

కథ సాధారణమైన ప్రేమగాథ అయినప్పటికి రసవంతంగా నడిచింది. పైగా నూతన పోకడలతో టి ప్రజాను రంజకంగా తయారయింది యీ చిత్రం.

ఈ చిత్రంలో అక్కడక్కడ కొన్ని ఘట్టాలు వాస్తవికతకు దూరంగా నున్నవనిపించినా కథ చివరదాక సరళంగా నడిచి రక్తిగానేయున్నది.

సంభాషణలు సమయోచితంగానున్నవి.

సంగీతము మనోజ్ఞంగానున్నది.

అంజలీదేవి అమోఘంగా నటించింది. నాగేశ్వరావు తన పాత్ర నిర్వహణలో ప్రత్యేకత ఏమి ప్రదర్శించలేక పోయాడు. నూతన తార వసంత, కన్నడతార పండరీబాయి చక్కగా నటించారు.

ఈ చిత్రం విశేషంగా ప్రజల ఆదరాభిమానములకు పాత్రము కాగలదని మా నమ్మకం.

చివరదాక అమోఘంగా నటించి ప్రేక్షక హృదయాలను కదలించేదు.

నాయకిగా నటించిన టి. ఆర్. రాజకుమారి తన ఖ్యాతికి తగినట్లుగా రాణించలేకపోయింది. అంటే చిత్రపు భాష తనది కాకపోవడంవలన భావప్రకటనలో ఒప్పించలేకపోయింది.

నూతననటి విద్యావతి చక్కగా నటించింది.

ఈ చిత్రంలో సంగీతము ప్రత్యేకస్థానము నాక్రమించింది. ప్రేక్షకులను తన్మయులుగా చేస్తుంది.

బహుశః ప్రయత్నించియుంటే చిత్రంయొక్క పొడవు తగ్గించి యుండవచ్చును. దానివలన నష్టము ఉండకపోగా మరింతగా రాణించేదేమో.

యడవల్లి, కృష్ణశాస్త్రిగార్ల మాటలు, పాటలు బాగానేయున్నవి.

మొత్తము మీద యీ చిత్రం ఉత్తమశ్రేణికి చెందిందనడానికి సంశయములేదు. విశేషంగా ప్రజల నాకర్షించగలదు.

'సిసి'

♦ ♦ ♦

**నా యిల్లు:-**

అపరిండియావారి 'నా యిల్లు' చిత్ర నిర్మాణం కృషిఫలించి ఉత్తమచిత్రంగా వెలువడింది. శ్రీ నాగయ్యగారు నటుడుగానే కాక నిర్మాతగాను, డైరెక్టరుగాను పేరు ప్రఖ్యాతులు సంపాయించి పెట్టగలదీ చిత్రమనడములో సందేహము లేదు.

ఈ చిత్రం ఒక సామాన్య కుటుంబీకుని ఆత్మకథ. అందులో శివరాంగా నటించిన నాగయ్య మొదటినుండి



కృష్ణాపిక్చర్సువారి "అమ్మలక్కలు" లో నొకదృశ్యం




ఒక యూరిలో నొక రాజుండెను. అతనికేకొరత లేకుండెనుగాని సంతానకొరత మాత్రమా రాజును బాధించుచుండెను. ఇట్లుండ నొకనాడు రాణి వనమునకు వెళ్ళగా నచట పులిపిల్లలాడుకొనుచుండెను. అదిచూచి యీమె యాహా! యీ పులియైనను నాకు పుట్టరాదా యనుకొనెను. అట్లే నామె గర్భవతియై పులిని గనెను. దాని నొక గదియందుంచి యాహారము నిచ్చుచుండిరి. పులికి వివాహముచేయగా నామెను మింగివేసెను. మరల పెండ్లి చేయగా మరల మ్రింగెను. అందువలన రాజు తన పెంపుడు పుత్రికనే పెండ్లిచేయుటకు నిశ్చయించెను. రాణి పుత్రికకు తలంటి నీరుపోయుచు నేడ్చెను. ముత్యాలరాణి యదిచూచి నీవెందుల కేడ్చెదవని యడిగెను. రాణి యంతయు చెప్పెను. ముత్యాల రాణి సరియేననెను. ఆమెకు పులికి పెండ్లి చేయగా పులి యామెను మ్రింగబోయెను. ఆమె తలుపువైచి వెళ్ళి తపస్సుచేయగా పార్వతీ పరమేశ్వరులు ప్రత్యక్షమై నొక దీపమునిచ్చి, నీవు వెళ్ళి దీపమును పులిపై వేసి వెండి బంగారు బెత్తములతో తాకించి నీవు మూల కూర్చుండుమనిజెప్పి మాయమైరి. ఆమెవెళ్ళి యట్లుచేయగా పులి రాకుమారుడాయెను. వారు సభలోనికిరాగా వారందరు పులినిచంపి తన కిష్టమైనవానిని తెచ్చెననిరి. ముత్యాల రాణి భర్తను పులిచేసి, దీపమువేసి బెత్తములు తాకించి మూల కూర్చుండిన పురుషుడాయెను. వారంత సంతసించి వైభవముగ వివాహముచేసిరి. ఇట్లుండ నామె గర్భవతాయెను. ఇది తెలిసి తన నిజ అన్న వచ్చి తీసుకొని వెళ్ళుచుండగా త్రోవలో రాకుమారిని నీళ్ళబిందె యెత్తమని గొల్లపడుచు పిలచెను. నామె వెళ్ళగా దుస్తులుమార్చి రాకుమారిని బావిలోనికి త్రోసి తానన్నగారింటికి వెళ్ళెను. అన్న ముందువెళ్ళి అమ్మాయి చాలా బాగున్నదని చెప్పగా చుట్టుపట్లవారు చూచుటకు వచ్చిరి. గొల్లదికూడ గర్భవతియే. నామెకు కుమారుడు గల్గెను. ఆ సంగతి రాకుమారునకు తెల్పిరి. ఇట్లుండ రాకుమారి తాను వచ్చునపుడు భర్తతో నాకు కుమారుడైన రత్నాల వర్షము, కుమార్తెయైన పువ్వులవర్షము కురియునని చెప్పెను.

తానున్న భావిలో నాగేంద్రుడుండెను. అతనికి వీపుపై రణముండెను. తాను పడినపుడదిచితికెను. అప్పటినుండి బావిలో నుండెను. బావిలో నామెకు కుమారుడు గల్గెను. రత్నాల వర్షము గురిసెను. రాకుమారుడు నాభార్య బాగున్నదని సంతసించెను. ఒకనాడు గాజులవాడు వచ్చుచుండగా రాకుమారి తెరవైచుకొని గాజులు వేయించుకొనెను. అచట గొల్లదానికి గాజులు వేయుచు బావిలో నమ్మాయి చాలా బాగున్నదనిజెప్పెను. రాకుమారుడు నాకు చూపమన వారమురోజుల తరువాత చూపెదనని యట్లే చూపెను. రాకుమారి భర్తను లోనికిలాగెను. రాకుమారుడు సంతసించి కొంతకాల మచటనుండి కుమారుని భార్యను వెంటబెట్టుకొనివచ్చి గొల్లదానిని తరిమి సుఖముగ నుండిరి.

ఆకుల దేవకీదేవి

# లోకవార్తలు



రాజస్థాన్ ప్రధాన న్యాయమూర్తులైన శ్రీ కైలాస్ నాథ్ వాంఛూగారి సతీమణికి మద్రాసునందలి ప్రముఖ ఆంధ్రమహిళలు ఫిబ్రవరి 3_వ తేదిన రాయపేట ఉడ్‌లాండ్స్‌లో తేనీటివిందు చేసిరి. న్యాయవాది శ్రీమతి జాస్తి సీతామహాలక్ష్మమ్మగారు యం. యల్. సి., యీసందర్భమున విందులో పాల్గొనిన ప్రముఖ ఆంధ్రమహిళలను వాంఛూగారి సతీమణికి పరిచయముచేసిరి. ఈ విందులో పాల్గొనిన ప్రముఖులు డాక్టర్ ముత్తులక్ష్మి రెడ్డి, శ్రీమతి క్లబ్‌వాలా, లేడీరామమూర్తి, కందాపాపాయమ్మ, దువ్వూరి నరసమ్మ, పూరం అన్నపూర్ణమ్మ, కడప రామసుబ్బమ్మ, లక్ష్మిరఘురాం, యం. వి. కృష్ణరావుగారి సతీమణి, భాస్కరరావుగారి సతీమణి, బ్రమ్మయ్యగారి సతీమణిగారలు. మద్రాసు సంగీత కళాసభవారి నృత్యగానములతో విందు జయప్రదంగా ముగిసింది.

◆ ◆ ◆

హైదరాబాద్ రాష్ట్ర ఆంధ్రమహిళాసభవారు వారి ప్రెసిడెంట్ శ్రీమతి అరుణాదేవి, కార్యదర్శి శ్రీమతి కృష్ణకుమారిగారలు, మరికొందరు కార్యవర్గ సభ్యులతో ఆంధ్రదేశ సంచారము చేయనున్నారట. ఈ సందర్భమున మద్రాసు నగరమునకుకూడవచ్చి విరాళాలను సేకరించెదరు. అందరు సహకరించవలసినదిగా మహిళా సంఘమువారు విజ్ఞప్తి చేశారు.

◆ ◆ ◆

ఆంధ్రరాష్ట్ర నిర్మాణం సందర్భములో దానికి 50 కోట్ల రూపాయలు పరిహారం యివ్వవలసియుంటుందని న్యాయమూర్తి వాంఛూకు ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్ సంఘం నివేదించింది.

◆ ◆ ◆

మంత్రులైనవారు విలువగల పేటికలలో సమర్పించే సన్మాన పత్రాలను స్వీకరించరాదనియు, సన్మానాలు చేసేవారు సయితం యీ విషయాన్ని గుర్తుంచుకొని నిరాడంబరమైన ఏర్పాట్లు చేయాలని కాంగ్రెస్ అధ్యక్షుడు పండిత నెహ్రూ ప్రకటించారు.

◆ ◆ ◆

చౌకధాన్యం డిపోల మూసివేతను గురించి మద్రాసు ప్రభుత్వమువారు జిల్లా కలెక్టర్లకు విచక్షణాధికారాల నిచ్చారట.

◆ ◆ ◆

విద్యాబోధన భాషలలో ఇంగ్లీషుకు సాటి రాగలది భారత భాషలలో లేదని ఉత్తర ప్రదేశగవర్నర్ శ్రీ కె. యమ్. మున్షీగారి అభిభాషణ.

◆ ◆ ◆

స్త్రీలలో స్మాల్ సేవింగ్సు ఉద్యమాన్ని నడిపించవలసినదిగా తనకు ఇండియా ప్రభుత్వముచేసిన విజ్ఞప్తికి అఖిల భారత మహిళా సంఘపు అధ్యక్షురాలు అంగీకరించారట.

◆ ◆ ◆

హిందూస్థానీ, కర్నాటక సంగీతాలను మేళవించి దేశమంతటికీ ఒకే బాణి రూపొందించి ప్రచారంలోనికి తీసుకొని రావలెనని కేంద్రమంత్రి డాక్టర్ కేస్కర్‌గారి అభిభాషణ.

# మాతృదేవి ఆనందమాయి

ఆంగ్లమూలం :
శ్రీ కె. కె. మీనన్, బి.ఎ., బి.యల్.

అనువాదం :
కుమారి కె. వసంత

"మీరు నిర్మలాదేవిని చూడకుండ హిందూదేశమును వదలివెళ్లకండి. ఆమె యొక్క పవిత్రత ఉచ్ఛస్థితిని, ఉత్తమస్థానమును గడించినది. నలుదిశల ఆమె 'ఆనందమాయి' అను నామధేయముతో విరాజిల్లుచున్నది. ఆమె మొన్న మొన్ననే నా చిన్న పట్టణమగు జమ్‌షడ్ పూరును దర్శించినది. ఒక శిష్యుని కోరిక ననుసరించి ఆనందమాయి అమిత క్షీణదశలోనున్న ఒకరోగి గృహమునకేగెను. ఆమె ఆరోగి మంచము ప్రక్కగా నిలుచుండెను. ఆమె హస్తము లాతని నుదురును తాకగానే అతని మరణవేదనే మాయమయ్యెను. తత్‌క్షణమే అతని రోగమును అదృశ్యమయ్యెను. అతని యొక్క రోగనివారణ కతడాశ్చర్యచకితుడాయెను." అని అమియోభోసు తన మామగారైన యోగానంద పరమహంసతో పల్కెను. న్యూయార్కు నందలి తత్వజ్ఞాన భాండాగారము ప్రచురించినదియు, W. Y. ఈవాన్స్ వెంటి M. A. D. litt D.S.C. పలికిన తొలిపలుకు గలదియును అగు యోగానంద పరమహంస రచించిన "యోగి జీవితచరిత్ర" లో తాను ఆనందమాయిని కలుసుకొన్న సందర్భమున జరిగిన సంఘటనలన్నియు విశదముగా వర్ణించియున్నాడు. యోగానందుడు, "నేను దైవభక్తిగలవారి నెందరినో హిందూదేశమునందు చూచియున్నానుగాని, ఇటువంటి ఉత్తమురాలై కొనియాడ బడునట్టి స్త్రీ తపస్వి నెన్నడును చూడలేదు. ఆమె యొక్క శాంతమైన ముఖము అనిర్వచనీయమైన సంతోషముతో కూడుకొని యుండుటవలననే ఆమెకు "ఆనందమాయి" అను పేరు కల్గెను. దట్టమైనటువంటి నల్లని ఛాయగల కేశములు ముసుగును తీసివేసిన వ్రేలాడుచున్నవి. ఆమె నుదురునందలి చందనపు బొట్టు ఆధ్యాత్మిక దృష్టికి చిహ్నముగనున్నది. ఆమె ఆధ్యాత్మిక ప్రత్యేకతకు ఆమె చిన్నముఖము, చిన్నిచేతులు, చిన్నిపాదములు భేదమును సూచించుచున్నది."

తిరువణ్ణామలై యందలి రమణాశ్రమమున నివసించు తాలయార్ఖాను కరుణతో చేసినటువంటి ఘనమైన కృషికి ఎంతో కృతజ్ఞులము. ఇటీవలనే దక్షిణ హిందూదేశము, ఉత్తరహిందూదేశమునుండి వచ్చిన ఈ గొప్ప స్త్రీ తపస్వియొక్క దర్శనభాగ్యమువలన ధన్యత నొందినది. ఆమె మధురకువచ్చి రెండు మూడు రోజులు అచ్చట గడిపెను. అచ్చటి అధికారుల కెఱుకపఱచకుండా, వాటినిగూర్చి స్వల్ప జ్ఞానమే కల్గినను ఆమె ఊరి వెలుపలను లోపలను

ఉండు క్షేత్రములందన్నిటి యందును దైవారాధన, గావించెను. పవిత్రస్థలమైన శ్రీమీనాక్షి సుందరేశ్వరాలయమున నాల్గు భజనలు సలిపెను. ఈభజనలు వేలాది వేల జనుల నాకర్షించుటయేగాక, వారిలో ఆశ్చర్య కరమైనట్టియు, అద్వితీయమైనట్టియు భావములుద్భవించెను. ప్రతిదినము 8-45 నుంచి 9 గం॥ ల వరకు తుష్ణీం భావమును వహించుట ఒక దైవికమైన కార్యమే. ప్రతిదినము ఈభజనలకు పదివేల మంది హాజరైనను, భజనలను సలుపు సమయమున ఎంతో నిశ్శబ్దముగ ఒక పసి పిల్ల ఏడుపుగాని లేకుండ యుండెను. నిస్సందేహముగా ఇది దైవీకమైన ఆత్మచేయు అత్యద్భుతకర విషయమే. ఇతరులు గంటల తరబడి బోధించిన దానికంటె ఆమె దృష్టియు, మౌనమును వేయిరెట్లు అధికముగా బోధించెను.

నిర్మలాదేవి బెంగాలు దేశమున ఒక గ్రామమున 1896లో ఒక బ్రాహ్మణ కుటుంబమున జన్మించెను. బాల్యదశలోనే ఆమెయందు అసాధారణముగ నేదో స్పష్టముగ కనబడ జొచ్చెను, ఆమెను గూర్చి ఏదో ప్రత్యేకతయు, ఉపేక్షయును ఉండెను. చాలామంది ఆమె బుద్ధి మాంద్యముగా నున్నట్లు భావించిరి.

ఆమె తల్లి తండ్రులు ఆమె భావికాలమును గూర్చి తెలియుటకు కుతూహల పడుచుండిరి. ఆమె నడుచునపుడు చూచు వృక్షములతోను, వాస్తవికతకు దూరమైన వస్తువులతోను, మాట్లాడెడిది. ఒకప్పుడు వెంటనే మాట్లాడుటను మానివేసి ఏదో పరధ్యానముగ నాలోచించుచుండును.

బాల్యముననే ఆమెను దైవభక్తిగల ఒకనికి యిచ్చి వివాహముగావించిరి. వివాహమైన రోజులను గూర్చి ఆమెయే యోగానంద పరమహంసతో నిట్లు వర్ణించినది- "నాయొక్క బంధువులు నన్ను ఈవ్యక్తికిచ్చి వివాహము చేయుటకు సన్నాహములు మొదలిడిరి. నాభర్త ప్రియ భాషణల గావించుచు నాదగ్గరకు వచ్చి మెల్లగ నన్ను తాకగనే మెఱుపును తాకినట్లు దెబ్బతగిలెను. నాభర్త నా ఎదుటనే కూర్చుని చేతులు జోడించి క్షమాపణ వేడుతూ ఇట్లనెను-" తల్లీ నువ్వు ఈశ్వర తుల్యురాలగు తల్లివని తెలియక, నాయొక్క సతి అనియే తలచి కామముచే నిన్ను తాకుట వలన నీపవిత్రతకు భంగమును కలిగించితిని. కావున నేనొక ప్రతిజ్ఞను చేసెదను. నేనెల్లకాలము నీశిష్యునిగా, బ్రహ్మచర్యమును అవలంభించి నీ అనుచరుడనై నీ సేవకునిగానుండెదను. నాజీవితాంతము వరకు ఎవరితోను, సంభాషించను. ఓ! గురూ! నేను ఈదినము నీకు చేసినటువంటి అపచారమునకు పరిహారముగా ఇట్టి ప్రాయశ్చితమునకు పాత్రుడనా"

అమె ఆకర్షణీయమైన వదనము, నేత్రములు మహా సముద్రమును జ్ఞప్తికి తెచ్చును. అమె మితభాషిణి. ఎపుడైనను ఆమెను మాట్లాడమని వేడుకొనిన ఆమె, "నేనొక పసిపాపను; నాకేమియు తెలియదు" అని బదులు చెప్పును. కాని అమె నెపుడైనా ప్రశ్నలు వేసిన యెడల, తత్త్వశాస్త్రమునందలి కష్టమైన విషయములను కూడా, స్వేచ్ఛగా ప్రసన్న వదనాబ్జముతో చెప్పగలదు. ఆమెను పాడమని అడిగిన "నేనొక పసిబిడ్డను. నాకేమియును తెలియదు 'అని ప్రత్యుత్తరమొసగును. కాని అమె పాడుటకు పూనుకొనిన అంత్యవిహీనమైన ముత్యముల వరుసవలె భావపూరితమగు మధుర గానము ఆమె నోటినుండి వెలువడును. ఆమెగానము మన మనస్సును రంజింపజేయును. ఆమె కంఠము మధురముగ ఎల్లకాలము వీనులకు విందు గొల్పుచుండును.

ఆమె శిష్యుడొకడు వ్రాసిన 'Mother as revealed to me' అను పుస్తకము · దాసుగుప్తచే ఆంగ్లభాషకు తర్జుమాచేయబడినది. అందు ఆమె చేసినటువంటి అత్యద్భుత కార్యములు ఎన్నియో వ్రాయబడినవి. సహజముగా వాటిని విశ్వసించుట కష్టమే. ఆమె మధురలో మూడురోజులు మౌనమును వహించి యుండు సమయమున ఆమె కన్నులనుండి అమిత కాంతివంతమైన వెలుగేదో నాలుగు పర్యాయములు వెలువడినట్లు నాస్నేహితుడగు ఒక వకీలు చెప్పెను. అతని మిత్రుడింకొకడు కూడా ఆదినము దీనిని గమనింపగల్గెనని కూడా నాతో చెప్పెను. ఇవన్నియు మానసికముగ కల్గు భ్రమయే యని మీరు చెప్పవచ్చును. కాని ఎవరును నాకు స్వయముగా కల్గిన అనుభవమును గురించి అట్లు చెప్పలేరని గట్టిగా చెప్పగలను. నాకూతురు రెండు వారములుగ టైఫాయిడు జ్వరమువచ్చి పండుకొనియుండెను. ఆసమయమున భజనల ఏర్పాట్లు సలుపుటకై నేను తప్పనిసరిగ దేవాలయమునకు వెళ్లవలసి యుండెను. నా భార్య పిల్లదగ్గర యుండవలసివచ్చెను. నేను ఆనాడు ఇంటినుండి బయలు దేరగానే నాభార్య మాతాజీని దర్శించుటకు గాని, ఆమె భజనలు వినుటకుగాని సాధ్యము కానందుకు కల్గిన విచారమును తెలిపెను. అపుడు నేను భజనజరుగు మధ్య సమయమున తిరిగివచ్చి ఆమెను కొంచెము సేపటికి పంపెదనని చెప్పితిని. కాని ఆదినము మాతాజీ వచ్చి ఆసీనురాలు కాగానే తాలయార్క ను "నీభార్యనెందుకు తీసుకొని రాలేద"ని అడిగెను. నేనపుడు గృహమునందసౌకర్యములు కలుగుటచేత రాలేకపోయినదని బదులు పల్కితిని. ఆమె నాతో 'రేపు సాయంకాలము ఆరుగంటలకు సత్రమునకు వచ్చి మాతాజీని కలుసుకొనమని నీభార్యతో చెప్పుము" అని చెప్పెను.

(సశేషము)

# సంపాదకీయములు

## విశాలాంధ్ర ప్రజారాజ్యం!

ఈ నినాదం చాల ఆకర్షణవంతమయింది. దానిని చేయూతగా తీసికొని ఒకరాజకీయవర్గమువారు స్వప్రయోజనాలను, లక్ష్యాలను సాధించడానికి ఎడతెరపిలేకుండా పాటుపడుతుంటారు.

భారతదేశ సమైక్యతను జాతీయదృష్ట్యా పరిశీలించిన ప్రతి భారతీయుడికి యీ 'రాజ్యం' నినాదం వెగటుగా కనుపించకతీరదు.

ప్రజలు సయితం యీ నినాదాన్నిచూచి అప్పుడప్పుడుపప్పులో కాలేస్తుంటారు. ఈనాడు ఆంధ్రులకు—ముఖ్యంగా మద్రాసు రాష్ట్రంలోనున్న తెలుగువారికి కావలసింది ఏమిటి? తమభాష, సంస్కృతి ఆర్థిక పరిస్థితుల పురోభివృద్ధి. ఇందుకుగాను ఆంధ్ర రాష్ట్ర ఉద్యమం ప్రారంభమయి అనేకమంది అతిరధ మహారధుల నాయకత్వాన, అఖండత్యాగముల ఫలితంగా యీనాడు ఆ ఉద్యమం ఫలించి రాష్ట్ర నిర్మాణమంటూ కనుచూపుమేరకు వచ్చింది.

ఈ సందర్భంలో హైదరాబాద్ సంస్థానాన్ని భాషాప్రయుక్త ప్రాంతాలుగా విభజించి తెలుగు ప్రాంత్యాన్ని ఏర్పడబోయే ఆంధ్రరాష్ట్రమునకు చేర్చాలనియు, హైదరాబాద్ ఆ రాష్ట్రానికి ముఖ్యపట్టణం కావాలనే నినాదం నలుమూలలా వినబడుతున్నది. కాని ఆలోచనా సయితమయిన నిదాదంమాత్రంకాదు. ఏదో ఒకపార్టీ, తమలక్ష్యసిద్ధిని, స్వప్రయోజనాల సాధనను దృష్టిలోనుంచుకొని తాము కంటున్న 'రాజ్యం' కలలను యీ నినాదం బలపరుస్తుంది కాని హైదరాబాద్ నందలి వివిధభాషా ప్రాంతాలను విడదీయుటవలన గాని, తెలుగు ప్రాంతాలను ఏర్పడనున్న ఆంధ్రరాష్ట్రంతో తక్షణం కలుపుటవలన సాధించబోయే ప్రత్యేక ఘనకార్యముండదు.

ఎందుకంటారా — హైదరాబాద్‌లో తెలుగు భాష, సంస్కృతియే ప్రధానమయినవి. తెలుగువారి జనాభాయే అధికంకాబట్టి వారు నివసించే ప్రాంత్యమే మిగిలిన అన్ని భాషావాదుల దానికంటే విశాలమైనది. అంటే యించుమించుగా హైదరాబాద్ తెలుగువారి రాజ్యంగా విలసిల్లుతోంది. ఆంధ్రభాషయేమి, సంస్కృతి ఏమి, అవిచ్ఛన్నంగా అభివృద్ధిగాంచుతున్నవి. ఆర్థికరంగంలో సయితం తెలుగువారిదే ముందడుగు. అంటే మద్రాసు రాష్ట్రంలో తెలుగువారికిలేని అవకాశాలను హైదరాబాద్ సంస్థానంలోనివారు అనుభవిస్తున్నారు. అటువంటప్పుడు ఆ సంస్థానంలోని తెలుగు ప్రాంత్యాలు ఏర్పడబోయే రాష్ట్రంతో చేరడంవలన కలిగేప్రత్యేక వసతులేమిటి? ఇక ఏర్పడబోయే రాష్ట్రానికి హైదరాబాద్ ప్రాంత్యాలలేమివలన ఏర్పడేలోటులేదు. ఏర్పడబోయే ఆంధ్రరాష్ట్రానికి అన్ని వసతులున్నవి. ఆర్థికపరిస్థితుల దృష్ట్యాకూడ స్వయం సమృద్ధంగానున్నదేమో — లేదాచేసుకోడానికి అవకాశమున్నదని ఆర్థిక శాస్త్రవేత్తల వాదం.

అయితే ఏర్పడనున్న ఆంధ్రరాష్ట్రమునకు రాజధాని విషయంగా హైదరాబాద్ నగరం ప్రజలను కొంత ఆకర్షించవచ్చును. తెలుగువారు చెమట ఓడ్చి, ధనమువెచ్చించి మద్రాసు నగరనిర్మాణానికి, పురోభివృద్ధికి కృషిచేసి, అనేకవందల సంవత్సరములనుండి నివసిస్తూ వర్తకవ్యాపారములు నిర్వహిస్తుండి, చివరకు యీ నగరము ఆంగ్లేయులకు మొట్టమొదట దానంగా యిచ్చిన పాలకుడు తెలుగువాడనే చరిత్రాధారాలుండి

కూడ ఆ నగరంమీద సర్వహక్కులు వదలుకొని మరొకభాషా ప్రాంత్యమువారికి ఒప్పచెప్పి అవిచ్ఛిన్నవైభవంతో రాజిల్లుతున్న మరొక ఆంధ్రరాజ్యపు రాజాధానిని తమకు కావలెనని కోరడం అసమర్థతను మాత్రమే ప్రకటిస్తుంది. హైదరాబాద్ సంస్థానము, ఏర్పడనున్న ఆంధ్ర రాష్ట్రము రెండు తెలుగురాష్ట్రాలుగా పరస్పర సహకారంతోటి అభివృద్ధిగాంచడానికి వీలు లేదని ఎవరైనా అనగలరా? హైదరాబాద్‌ను భాషా ప్రాంత్యాలుగా విడదీయాలని కోరవలసింది ఆ సంస్థానంలోని యితర భాషాప్రాంత్యపువారు కాని తెలుగు వారు మాత్రంకాదు.

చరిత్రాధారాలనుబట్టి, మద్రాసు నగరంలోని వాస్తవిక పరిస్థితులనుబట్టి ఆంధ్రులు తమహక్కును వదలుకోడం చాలపొరబాటు. అయితే ప్రస్తుతపు నగరంలోని వివిధ భాషావాదుల జనాభానుబట్టి అందరి శ్రేయస్సు, హక్కులు, అవకాశాల దృష్ట్యా చీఫ్‌కమీషనరు రాష్ట్రంగా ఏర్పడాలి. దానికని ప్రతి ఆంధ్రుడు ప్రథమంగా కృషిచేయడానికి దీక్షవహించాలి. ఆనాడు ఆంధ్రరాష్ట్రపు రాజధాని మద్రాసు నగరంగా నుండటానికి అవకాశముంటుంది. ఒకవేళ హైదరాబాద్ సంస్థానమందలి తెలుగు ప్రాంత్యాలు విడదీయబడి ఏర్పడనున్న ఆంధ్ర రాష్ట్రంలో చేర్చినా, మద్రాసు నగరంతో అవసరం తీరిపోదు; నగరమును చేయిజారడం వలన ఆంధ్రులకు యీ తరమువారికేకాక రానున్న తరతరాలవారికికూడ తీరని నష్టమనే చెప్పాలి.

## పడుపు వృత్తి నిర్మూలన

పడుపువృత్తి అంటే ప్రతివారికి అసహ్యమే. కాని ప్రభుత్వచట్టాలున్నా యీ వృత్తి అరికట్టబడలేక పోవడానికి కారణములు మాత్రం అనేకం.

ముఖ్యంగా ఆర్థికదుస్థితి, సంఘములోని నైతిక పతనం, వాస్తవిక పరిస్థితులను ఎదుర్కొన కలిగిన శక్తిలేమి కారణాలు.

భారతదేశమును యితర దేశములతో పోల్చిచూస్తే సంపాయించేవారి సంఖ్య బహుకొద్ది, తినేవారి సంఖ్య అత్యధికం. ఆడ, మగ అనే విచక్షణ లేకుండా ప్రతివ్యక్తి తన కుటుంబ శ్రేయస్సు దృష్ట్యా ఉచిత మార్గాలలో ధనార్జనచేస్తే యిప్పుడున్న ఆర్థిక దుస్థితి కొంతతొలగిపోతుంది. దాంతోటి పడుపువృత్తిలాంటి దానిని అవలంభించవలసిన అవసరంగాని, దాని మూలంగా శారీరకమైన బాధలకు లోనుకావలసిన అవసరముండదు. అలా కాకుండా పదిమందిగల కుటుంబములో ఏఒక్కరో సంపాయిస్తుండి మిగిలిన 9 మంది తినే పరిస్థితులలో తమదైనికవసరాలు గడువవు సరిగదా పడుపువృత్తికి నిర్మూలన అనేది యుండదు.

సంఘంలో నైతికపతనం అరికట్టబడాలి. అంటే సాంఘిక జీవితం క్రమబద్ధంగాను, నియమబద్ధంగాను సంఘశ్రేయస్సు దృష్ట్యా – తద్వారా దేశశ్రేయస్సు దృష్ట్యా రూపొందాలి. అది ఎలాగ సాధించగలమంటే మనము చదివే వాఙ్మయము, చూచే దృశ్యాలు, చేసే స్నేహం మొదలగు వాని ద్వారా ప్రతియొక్క సాంఘిక సమస్యను వాస్తవిక పరిస్థితుల దృష్ట్యాపరిశీలించి పరిష్కరించితేగాని పడుపువృత్తిలాంటి దుర్వ్యసనాలు నిర్మూలించబడలేవు.

ఈ సందర్భంలో ప్రభుత్వ శాసనాలు మాత్రం పడుపువృత్తిని నిర్మూలించలేవు. వానితోబాటు సంఘసేవకులు, సంస్కర్తలు నడుముకట్టి ప్రభుత్వముతో సహకరిస్తూ ఎప్పటికప్పుడు సంఘములోని దురలవాట్లను, దురాచారాలను, దుర్వృత్తుల నిర్మూలనకు కృషిచేస్తేనేకాని ప్రజలలో నైతికశక్తి పెరుగదు. దాంతో పాటు ఎవర్లు చేయ నవకాశముగల పనిని వాళ్ళుచేస్తూ ఆడ మగ విచక్షణలేకుండా కుటుంబ బాధ్యతలను వహించిననాడు అన్నీ సఫలితాలే.

—o—




'గీతావాణి' గీతాజయంతీ మహోత్సవప్రత్యేక సంచిక మా కార్యాలయం చేరింది. ప్రచురణకర్తలు గీతాప్రచురణ సమితి, ఆళ్లగడ్డ, కర్నూలు జిల్లా.

ఇందులో అనుభవశాలురు, పూజ్యులయిన అనేకరచయితల గీతాసందేశమునకు సంబంధించిన అమూల్యమైన వ్యాసములున్నవి. ప్రస్తుతపు వివిధపరిస్థితులు చక్కబడటానికి ప్రజలకు గీతాసందేశం విశేషంగాను పకరిస్తుంది. స్వయంగా భగవద్గీతను చదివి దానివలన లాభము పొందలేని వారికి గీతావాణి విశేషంగా నుపకరిస్తున్నది.

గీతాప్రచురణసమితివారి కృషి యీ సందర్భమున మహోత్కృష్టమైనది. విశేషంగా ప్రజాసహకార సానుభూతులతో గీతాసందేశమును మూలమూలల వ్యాపింపజేయుటకు సమితి కృషిచేయగలదని మానమ్మకం. సంపాదకుడు యన్, శ్రీకంఠం, వెల 0-12-0

**మహాత్మా ఉపాసనీబాబా: శ్రీ కేశవతీర్థస్వామిగారు; ప్రకాశకులు సాధనగ్రంథ మండలి, తెనాలి. వెల రు 1-8-0.**

గ్రంథకర్త భక్తుడు, పూజ్యుడు. ఈయన శ్రీ సద్గురు సాయిబాబాశిష్యులు. శ్రీఉపాసనీబాబాచరిత్రను రచించారంటే తప్పక చదువవలసిన గ్రంథమని చెప్పకతప్పదు.

భగవత్ స్వరూపము అనేకరూపములుగా అనేకులలో రూపొందుతుంటుంది. అందులో శ్రీసాయిబాబా అవతారమొకటి. ఆ మహానుభావుని శిష్యుడు శ్రీబాబా. వారిజీవితంలోని వివిధఘట్టాలు, విశేషాలు మహిమోపేతమయినవయి యుండిన వనేకములు కలవని యీ గ్రంథము తెలుపుచున్నది. ఈ గ్రంథము సమస్తప్రజానీకానికి పఠనయోగ్యమే కాక ప్రయోజనకారి కూడాను.

**నందికొండ చిలుక: శ్రీ కన్నెకంటి వీరభద్రాచార్యులు (పల్నాటి సోదరకవులు) ప్రకాశకులు: నందికొండ ప్రాజక్టుకమిటీ, నిడుబ్రోలు. వెల 0-8-0.**

కృష్ణానది జలములతో షుమారు 70,00000 లక్షలయకరముల భూమి సాగుకు తేగల నందికొండ ప్రాజక్టు నిర్మాణానికి సాగుచున్న ఆందోళనను ప్రతిబింబింప జేయడమే యిందలి పద్యాల ఉద్దేశం. కరువుకాటకాలతో మలమల మాడిపోతున్న మెట్టప్రాంతీయుల ఆవేదన యిందులో గమనించవలసినది.

పద్యరచన బహుసరళంగా, భావయుక్తంగా మనోహరంగా నడిచింది. నందింకొండ ప్రాజక్టు నిర్మాణం వలన ఆహార సమస్యకు శాశ్వత పరిష్కారము సమకూరుననుటను యీగ్రంథములో చిత్రించబడింది కూడాను.

◆ ◆ ◆ ◆

దేశీయవైద్య కళాశాల తెలుగు విద్యార్థి సమితివారి యుగాది రజతోత్సవసంచిక మాకార్యాలయమునకు చేరినది.

ఈ సంచికను పరిశీలించి తెలుగు విద్యార్థి సమితివారు తమ సంఘాభివృద్ధికిగాను జరుపుచున్న కృషిని ప్రశంశించక తప్పదు. ఈ సంచిక, జరుపుకున్న రజతోత్సవము సంఘసభ్యులలోని సమైక్యత, కార్యశూరత్వము మొదలగు వానికి నిదర్శనములు.

స్వీ కా ర ము

గృహలక్ష్మి

ఇందులో సుప్రసిద్ధరచయితలు, కవులు వ్రాసిన గద్య పద్య రచనలనేకములున్నవి. ప్రతియొక్క రచన అమూల్యమైనదనే చెప్పాలి. ఈ విద్యార్థిసమితివారి 25 సంవత్సరముల చరిత్రను వ్యక్తము చేసే అనేక ఛాయా చిత్రములున్నవి.

ఈ సంచికను వ్యయప్రయాసల నెదుర్కొని విజయవంతంగా వెలువడజేసిన యుగాది రజతోత్సవ సంచిక కమిటీవారు- ప్రధానంగా శ్రీ డి. వి. అప్పళాచార్యులుగారు అభినందనీయులు.

సి. సి. పున్నయ్య

**అర్థపంచకము:-** 'మోక్షసాధని' సంపాదకులైన కుందుర్తి వేంకట నరసయ్యగారు రచించినది, ప్రకాశకులు: సాధనగ్రంథ మండలి, తెనాలి. మూల్యము, వెల 0-12-0

సాధనగ్రంథ మండలివారి ప్రచురణలలో ఈ గ్రంథం ఏభైయోది. దీనినిబట్టి వీరు ఇంతవరకు చేసిన గొప్పసేవను ఊహించుకోవచ్చును. ఈ గ్రంథమండలికి ప్రజల సహాయ మత్యవసరం. దానికోసం గ్రంథమండలి వారి ప్రచారమవసరం.

తత్త్వజ్ఞానాన్ని బోధిస్తూన్న ఉత్తమ గ్రంథమిది. గ్రంథకర్త సంస్కృత భాషాపండితులు. ఆయన బహుసులభ వచనంలో అందరకు అర్థమయేటట్లు అర్థపంచక మంటే ఏమిటో బోధించేరు. అర్థపంచక మంటే - ఉపాస్యవస్తువు యొక్క స్వరూపము, ఉపాసనచేయువారి స్వరూపము, ఉపాసన చేయుమార్గము, ఉపాసన చేయుటచే గలుగు ఫలము, ఉపాసన చేయుటలో గలుగు విఘ్నములు. వీటినిగురించి ఈ గ్రంథంలో చక్కగా చర్చించబడింది. తత్త్వాన్ని మతాన్ని తెలియజేసే గ్రంథాలలో నూతన విధానము (New Treatment) అవసరము. అట్టి నూతన విధానంలోనే ఈ గ్రంథం రచించబడిందికాబట్టి బహు ఆకర్షకంగా ఉంది. భగవద్భక్తియొక్క అవసరాన్ని, ఘనతను తెలియచేసే ఈ గ్రంథాన్ని అందరూ పఠించి బాగుపడాలి. పుస్తక ప్రారంభంలో ఉండే రాధాకృపాకటాక్ష స్తోత్రానికి కూడా అర్థం అవసరం.

సాధన గ్రంథమండలివారి కృషి అమూల్యమైనది. తాటాకులలో జీర్ణిస్తూన్న పాతగ్రంథాలనుకూడా టీకాదులతో ప్రచురించి వారు దేశోపకారం చేస్తే ఉత్తమం.

**శ్రీ శుకుడు** - కర్త, దాసశేషుడుగారు. సాధన గ్రంథమండలి, తెనాలి-క్రౌన్ సైజు వెల రు 0-12-0

ఇదొక వచన గ్రంథం. కూర్పు చక్కగా ఉంది.

మహానుభావుడైన శుకుడు వేదవ్యాసమహర్షి యొక్క కుమారుడు. వేదవ్యాసుడు తపస్సుచేసి ఆ వరపుత్రుణ్ణి కన్నాడు. అటువంటి పుత్రరత్నం జీవితం చిన్నప్పటినుంచి అద్భుతంగా ఉండక - తప్పదు. శుకుడు సకల విద్యలను అధ్యసించి తండ్రి అనుజ్ఞమీద జనక మహారాజును దర్శించి, మరికొంత జ్ఞానాన్ని ఆర్జించేడు. ఆటుతర్వాత అతను నారదమహాముని ఉపదేశాన్ని పొంది, సాంఖ్య యోగవిద్యల ఘనత తెలుసుకొని, జన్మ తరింపజేసుకొన్నాడు.

గ్రంథ శైలి ఇంకా సులభంగా ఉండాలి.

దాసశేషుడుగారు భారతాది గ్రంథాలను పరిశీలించి ఈ ఉత్తమగ్రంథాన్ని రచించేరు. చిత్తశాంతి కోసం తపించిపోతూన్న ఆధునిక ప్రపంచానికి ఇటువంటి గ్రంథాలు అత్యవసరం. సాధనగ్రంథమండలి వారు ధర్మప్రచారాన్ని దీక్షతో చేస్తున్నారు. ప్రజలు ఆ సంస్థకి అన్నిరకాల ప్రోత్సాహమియ్యాలి. సాంఖ్య యోగాలనుగురించి తెలుగులో గ్రంథాలు అవసరం.

ఏటుకూరి ఉమామహేశ్వరరావు

——

## నందననామ సం॥ర ఫాల్గుణ మాసము

| | | | |
|---|---|---|---|
| 1953 సం॥ ఫిబ్రవరి నెల | 16 | సో | తృ 43.24 పూభా 12.56 త్యా 3.43 |
| | 17 | మం | చ 37.43 ఉభా 8.43 త్యా 3.46 |
| | 18 | బు | పం 32.44 రే 5.5 త్యా 3.49 |
| | 19 | గు | ష 28.41 అశ్వ 2.14 కుమారషష్ఠి |
| | 20 | శు | స 25.40 భర 0.24 త్యా 3.58 |
| | 21 | శ | అ 23.57 కృ 60.10 త్యా 11.3 అమృతసిద్ధియోగం |
| | 22 | ఆ | న 23.24 కృ 0.13 |
| | 23 | సో | ద 24.8 మృ 1.58 త్యా 4.12 అమృతసిద్ధియోగం |
| | 24 | మం | ఏ 26.2 ఆర్ద్ర 4.53 త్యా 4.16 |
| | 25 | బు | ద్వా 24.57 పున 8.51 త్యా 4.20 |
| | 26 | గు | త్ర 32.43 పుష్య 13.41 త్యా 4.22 అమృతసిద్ధియోగం |
| | 27 | శు | చ 37.6 ఆశ్రే 19.10 |
| | 28 | శ | ○ పౌ 41.51 మఖ 25.4 త్యా 4.24 |
| 1953 సం॥ మార్చి నెల | 1 | ఆ | బ పా 46.40 పూఫ 31.6 త్యా 4.24 వసంతోత్సవం |
| | 2 | సో | వి 51.17 ఉఫ 37.0 త్యా 4.22 |
| | 3 | మం | తృ 55.25 హ 42.31 బ్రహ్మకల్పః |
| | 4 | బు | చ 58.49 చి 47.22 త్యా 4.20 |
| | 5 | గు | పం 60.10 స్వా 51.20 త్యా 4.16 |
| | 6 | శు | పం 0.59 విశా 54.17 త్యా 4.12 |
| | 7 | శ | ష 2.14 అనూ 56.0 |
| | 8 | ఆ | స 2.15 జ్యే 56.29 త్యా 4.2 భానుసప్తమి |
| | 9 | సో | అ 1.1 ఏవ్య 57.48 మూ 55.44 |
| | 10 | మం | ద 55.6 పూషా 53.49 త్యా 3.53 |
| | 11 | బు | ఏ 50.23 ఉషా 50.54 త్యా 3.49 |
| | 12 | గు | ద్వా 44.52 శ్ర 57.10 త్యా 3.45 రా 26.42 త్యా 3.43 |
| | 13 | శు | త్ర 38.46 ధ 42.53 త్యా 3.42 |
| | 14 | శ | చతు 32.23 శత 33.21 మాసశివరాత్రి |
| | 15 | ఆ | ● అమా 25.58 పూభా 33.45 త్యా 3.43 |

printed and Published by Dr. S. Seshagiri Rao at the Lodhra Press, Kesari Kuteeram Ltd.
15, Westcott Road, Royapettah, Madras. Editor : Dr. K. N. Kesari.

